# సామాన్యుని సందేశం

వచన కవిత

మొదటి భాగం

బి. ఎన్. రెడ్డి, M. S. (U. S. A.)

సుకృత పబ్లికేషన్స్
హైదరాబాదు

SAMANYUNI SANDESAM
BY
B. N. REDDY

PUBLISHERS
SUKRUTA PUBLICATIONS

FIRST EDITION
1976

ART WORK
SRI K. SESHAGIRI RAO

PRINTERS
SRI VARALAKSHMI PRESS
6-1-778, Khairatabad
Hyderabad-4

PRICE
Rs. 4-50

FOR COPIES
VIRGO
6-3-1063/B/3-Lakdikapul
HYDERABAD-500004

# అంకితం

ఈ విశాల ప్రపంచంలో జన్మించిన వారెందరో దురదృష్టవశాత్తు పలురకాల బాధలు పడుతున్నారు. అలాంటి నా సోదర సోదరీమణు లందరి కష్టాలు తీరి వారు సుఖశాంతులతో హాయిగా జీవించాలని హృదయపూర్వకంగా కాంక్షించే—సహృదయులందరికీ

ఈ నా పుస్తకం అంకితం.



# నా పరిచయం

నకిరేకల్లు గ్రామంలో జన్మించి, నల్లగొండలో H. S. C., హైదరాబాదులోని సిటీ కాలేజీలో I.S C. చదివి, ఉస్మానియా ఇంజ నీరింగు కాలేజీలో 1956 లో B. E. పట్టం పుచ్చుకొని అమెరికా వెళ్ళి M.S. డిగ్రీ తీసుకొని అక్కడ నాల్గు సంవత్సరాలపాటు వుండి Consulting Office లలో పెద్దపెద్ద భవనాల డిజైన్లుచేసి, స్వదేశానికి 1963 ఉగాదినాటికి తిరిగివచ్చి VIRGO Architects & Engineers అనే సంస్థను ఏర్పాటుచేసి 12 సం॥గా ఎన్నో భవనాలు, హోటళ్లు, సినిమాలు, విద్యా సంస్థలు, పరిశ్రమ భవనములు డిజైను చేశాను.

ఉర్దూ మీడియంలో చదువుకున్నా విద్యార్థిదశనుండే తెలుగు భాష నా మాతృభాష అనే అభిమానం కొద్దీ అప్పు డప్పుడు ఏవో వ్రాసుకునే వాడిని.

అమెరికాలో వుండగా, మన భారతీయ సంస్కృతికి, పాశ్చాత్య పద్ధతులకున్న తేడా తెలియచేస్తూ వ్రాసిన ఒక వ్యాసం ఆంధ్రప్రభ వారపత్రిక 1962 దీపావళి సంచికలో ముద్రితమైనది.

నాకు సమయం దొరకనందున నాలోవున్న భావాలను కాగితంమీద పెట్టలేక పోయాను. కానీ—మన సమాజంలోని పద్ధతులను, ప్రపంచంలోని పరిస్థితులను చూస్తూంటే నా అభిప్రాయాలు కొన్ని వ్రాసి ప్రజలకు తెలియ చేయాలనే బలమైన ప్రేరణ కలిగి కొంత సమయం దీనికొరకు కేటాయించి యీనా అభిప్రాయాలను మీముందు పెట్టడం జరిగింది. ఇదే నా మొదటి కవితా సంపుటి "సామాన్యుని సందేశం."

—బి. యన్. రెడ్డి

# పీఠిక

ఎన్నోవేల సంవత్సరములక్రింద కోతి రూపంలో సృష్టించబడిన మానవుడు తన రూపానికి రంగులు దిద్దుకుంటూ క్రమేణా మనం నేడు చూస్తున్న చక్కని ఆకారాన్ని అందుకొన్నాడు. అంతేకాదు మిగతా జంతుజాలంకంటే ఎన్నోరెట్లు తన మేధాశక్తిని పెంచుకున్నాడు. ఆకాశానికెగురుతున్నాడు. చంద్రుణ్ణి చేరుకుంటున్నాడు, సముద్రాలను జయిస్తున్నాడు ఏవేవో ఘనకార్యాలు సాధిస్తున్నాడు. కానీ తనను తాను జయించలేకపోతున్నాడు. కోతినుండి పుట్టాననే పేరు సార్థకం చేసుకోడానికే కాబోలు కోతిబుద్ధులు మాత్రం మానలేదు. గిల్లి-కజ్జాలు తెచ్చుకుంటున్నాడు. ఒక సోదరుణ్ణిచూసి సకిలిస్తున్నాడు. ఇంకొకడిని చూసి ఇకిలిస్తున్నాడు. ఒకరిమీద రాయి విసురుతున్నాడు మరొకడిమీద తిన్నది పారవేస్తున్నాడు ఒకని కొంప పీకుతున్నాడు ఇంకొకని కొంపకు నిప్పంటిస్తున్నాడు తనతోకను ఏదోకరచినదని ఆ బాధా నివారణకు మందు వెతుక్కునే బదులు ఇంకొకడి తోకను కొరికి వాడూ బాధపడుతూంటే చూసి ఇప్పుడు ఇద్దరం సమానంగా వున్నాం ఫర్వాలేదు అని ఆనందిస్తున్నాడు.
సోదరులారా!

ఆత్మ - పరమాత్మ - పూర్వజన్మ మొదలగు వాటిగురించి చర్చించే అంత జ్ఞానంకానీ పాండిత్యంకానీ నాకులేదు. కానీ ఒక్క విషయం చెప్పదలుచుకున్నాను——

ఈ సృష్టిలోని యీ ప్రకృతి ఎన్నియుగాలనుండో అభివృద్ధి చెందుతూ వచ్చి ఇంత చక్కని రూపాన్నిదిద్దుకున్నది. యీ విశాల

ప్రపంచంమీద ఎన్నోకోట్ల జీవరాశి వున్నది. కాని జంతువులకు లేని బుద్ధిబలం కలిగి మానవజాతి ఒక విశిష్టమైన స్థానము సంపాదించు కుంది. మనమెన్ని ఖండాలుగా విభజించబడినా ఎన్ని దేశాలుగా ఏర్పరుచుకున్నా ఎన్ని రాష్ట్రాలుగా భాగించుకున్నా-ఎన్ని తెగలుగా ఎన్ని మతాలుగా ఎన్ని కులాలుగా వూహించుకున్నా మనమంతా ఒక్కటే. ఒకే సృష్టిలో పుట్టిన ఒకే సృష్టికర్త బిడ్డలం. అనంతమైన యీ సృష్టిలో మానవుడు భౌతికంగా (Physically) చూస్తే ఒక చిన్న అణువు మాత్రమే. అంతేకాదు మానవుడు నూరేళ్ళు బ్రతుకు తున్నానని విర్రవీగే ఆ కాలమంతా ఒక క్షణంతో సమానమే. నీవు పుట్టేదెప్పుడో-గిట్టేదెపుడో నీకు తెలియదు. కానీ మట్టిలో పుట్టి మట్టిలోనే కలిసేది మాత్రం తెలుసు. ఆ చావు ఏ క్షణమైనా రాగలదని కూడా తెలుసు. బ్రతుకున్నంత కాలం ఎంత విర్రవీగినా ఆ క్షణం రాగానే అంతా శూన్యం అని తెలుసు.

ఇన్నీ తెలిసిన మానవుడు మరి ఎందుకు మూర్ఖుడై పోతున్నాడు. ఎందుకు యీ మారణహోమం తలపెడ్తున్నాడు. ఎందుకు రక్త పాతం జరుపుతున్నాడు ఎందుకు ఈ ఓర్వలేని తనం. ఎందుకీ రసాభాసలు ఎందుకీ అసూయాద్వేషాలు ఎందులకీ దగుల్బాజీ వేషాలు. ఎందుకీ రొమ్ములు చరుచుకోడం-వీపులు విరుచుకోడం. ఎందుకీ నీచాతి నీచమైన పనులు.

ఒకవైపు అంతరాత్మ మొత్తుకుంటుంటే దాన్ని ధిక్కరిస్తూ ఎందుకీ తిక్క తిక్క వేషాలు వేస్తున్నాం ?

సోదరులారా !

బుద్ధిబలం - విచక్షణాజ్ఞానం మనలో అంతర్గతమైయున్నవి.

వాటి నుపయోగించి ప్రేమానురాగాలను పెంచుకోండి దీనులను రక్షించండి కష్టాలలోనున్న వారి నాదుకోండి అనాధలకు ఆశ్రయ మివ్వండి మంచిని పెంచండి మమతలు నింపుకోండి కానీ హాయిగా బ్రతికేవారి జీవితాలకు చిచ్చుపెట్టకండి.

బ్రతికేది నాల్గురోజులే - ఇదంతా మిధ్య. మనం ఎన్నో పిచ్చివేషాలు వేసి, ఎందరినో హతమార్చి (ప్రత్యక్షంగా-పరోక్షంగా) సంపాదిస్తున్న ఆస్తులు-పదవులూ అన్నీ మనందరినీ మోసంచేసి ఒక్క క్షణంలో మాయమైపోతున్నవి

అంతే కాదు నీవు చేయదలచుకున్నది అనుభవించేది సంపాదించ దలుచుకున్నది ఆనందించదలచుకున్నదే ఎదుటివాడుకూడా కావాలను కుంటాడని తెలుసుకొని ఒకరిని ఏడ్పించకుండా నష్టపర్చకుండా వారిని గంగలో ముంచకుండా గొంతులు కోయకుండా సంపాదించు ఆనందించు అనుభవించు కానీ యీ కోతి బుద్ధులు మానుకో.

బుద్ధిహీనులమై మనమిలా అసహ్యాకరమైన పనులెందుకు చేస్తున్నాం అనేబాధ,—మానవజాతి ఇలా నిర్వీర్యమైపోతే ఎలా అనే నా ఆవేదన-తపనయే నా యీ కవితకు కారణం-ప్రాణంకూడా.

అయినా మనలో మంచితనముంది విచక్షణాజ్ఞానముంది యీ ప్రపంచంమీద ఎందరో మహానుభావులు అప్పుడప్పుడు జన్మించి మనకుచేస్తున్న హితబోధలు కొంతవరకైనా మనం పాటిస్తే మానవ జాతి బాగుపడగలదని తెలియచెప్పడమే—

నా యీ "సామాన్యునిసందేశం".

విశ్వమానవ కళ్యాణమే నా ధ్యేయం.

"సుకృత" —బి. యన్. రెడ్డి

బంజారాహిల్స్, హైదరాబాదు-34 24 ఫిబ్రవరి, 1976

# ఆణిముత్యాలవంటి నిత్యసత్యాలు

కళాప్రపూర్ణ

డా॥ దాశరథి

ఏపుట్టలో ఏపాముందో! అని ఒక సామెత. ప్రముఖ వాస్తు శాస్త్రజ్ఞుడు, ఎన్నో గొప్ప కట్టడాలను నిర్మించిన వ్యక్తి, విదేశాలలో విద్యాభ్యాసంచేసి ఎంతో విజ్ఞానం సంపాదించుకున్న యువకుడు, ఉత్సాహి, సంస్కారి అయిన మిత్రులు శ్రీ B. N. రెడ్డిగారిలో — క్రాంతదర్శి యయిన కవి, మార్గదర్శి యయిన మహర్షి ఉన్నాడని ఆయన రచనలను సావధానంగావిని, చదివి ఆకళించుకునేదాకా నేను తెలుసుకోలేకపోయాను. అందుకే "ఏపుట్టలో ఏపాముందో" అన్నసామెత వచ్చివుంటుంది. నేను ప్రముఖులైన డాక్టర్లలో గాయకులను చూశాను, సైనికులలో రచయితలను గమనించాను, (Soldier-Poets)

నిజానికి ఒకవ్యక్తి వృత్తికీ, ఆయనకు గల కళాభినివేశానికీ సంబంధం లేదా. అందరు వాస్తు శాస్త్రవేత్తలూ కవులుకాలేరు అలాగే అందరు వైద్యులు గాయకులు కాలేరు. అందరు సైనికాధికారులు రచయితలూ కాలేరు. అయితే వారివృత్తికి కావలసిన విజ్ఞానం — వారిలోగల కళా ప్రతిభకు తోడ్పడకనూ మానదు ఒక ఉన్నతాధికారి కవికూడా అయితే, ఆయన తన దైనందిన జీవితంలో వృత్తిరీత్యాపొందే అనుభూతులు ఆయన చేసే కళాసృష్టిలోకికూడా ప్రవేశిస్తాయి. ఉదాహరణకు ఒక కలెక్టరు కవి అయితే ఫైళ్ళు, ప్రజల బాగోగులు కవితలో చొరబడతాయి అయితే ఆ కవిరచించే ప్రతిరచనలో ఇదే ఉండనక్కరలేదు. ప్రపంచం, విప్పిన పుస్తకం కదా!

మిత్రులు B. N. రెడ్డిగారు వయసులో చిన్న కాని ప్రతిభలో మిన్న, ఆయనలోని లోకపరిశీలనారీతి, ప్రపంచంలో జరిగే సంఘటనలకు ప్రకాశితులై తపన, వేదన, అనురాగం, ఆనందం, అనుభవించడం అంత చిన్నవయసులోనే ఒకవిధమైన వేదాంతం— ఈలోకం నశ్వరం ఇందులో మిగిలేది తక్కువ ముఖ్యంగా మానవజీవితం బుద్బుదప్రాయం. అనే పరిపక్వమైన భావన — ఆయన కవితలో అడుగడుగునా కొట్టవచ్చినట్లు కనపడతాయి. ఏవో ఊహాసౌధాలలో పేకమేడలలో కూర్చుని కలలుకనే భావకుడు బి. ఎన్. రెడ్డిగారు - ఆయన తనరచనలు వినిపిస్తుంటే అన్ని పనులూ మానుకుని, ఆరోగ్యంసంగతి మరచిపోయి, మంత్ర ముగ్ధుడనై మంత్రించబడి అలా వింటూనే ఉన్నాను. కొన్నాళ్ళక్రితం నేను హైదరాబాదు వచ్చినప్పుడు నావద్దకువచ్చి కొన్నిరచనలు వినిపించినప్పుడే నేను ఆశ్చర్యపోయి విన్నాను. ఈ వాస్తుశిల్పిలో అనల్పమైన కల్పనాశక్తి వున్నదని గమనించాను

“మీ రచనలు వెలుగుచూడాలి. పత్రికల్లో వెలువడి ఉండవచ్చు. అవి ఒకసంపుటంగా పుస్తకరూపంలోవస్తే బాగుంటుంది అన్నాను. ఈనాడు నాకల ఫలించింది. అందుకు బి. ఎన్. గారి పట్టుదల కారణం.

ఇటీవల మన అర్థిక శాఖామాత్యులు, పూజ్యులు శ్రీ పిడతల రంగా రెడ్డిగారి కుమార్తె వివాహం తిరుపతిలో (తిరుచానూరులో) జరిగినప్పుడు అనేకులతోపాటు నేనూ, బి ఎన్ రెడ్డి గారూ అక్కడికి వెళ్ళి వివాహ మహోత్సవంలో పాల్గొని మద్రాసు తిరిగివచ్చాం. ఆసందర్భంలో బి. ఎన్. రెడ్డి గారు తిరిగి హైదరాబాదు వెడుతూ రెండుపూటలు మద్రాసులో ఆగారు. అప్పుడు వారిదగ్గరకువెళ్ళి రమారమి నాలుగు గంటలపాటు వారి కవితా గానం విన్నాను. కవితాగానంఅంటే చాలామంది పాడటం అనుకుంటారు. పూర్వం రోజుల్లో రచనలు పద్యాలుగానూ, గేయాలుగానూ వున్నప్పుడు పాడడానికి యోగ్యంగా వుండేవి. ఇప్పుడు ముక్తచ్ఛందం (free verse) సర్వేసర్వత్రా కవులకు మాధ్యమంగా విశాలపరిధిలో తోడ్పడుతున్నది. హృదయంలోని స్వచ్ఛమైన భావాన్ని యథాతథంగా వ్యక్తీకరించడానికి ముక్తచ్ఛందం — దీన్నే వచనకవిత అంటున్నారు — తోడ్పడుతున్నది. నేను తరుచు ముక్తచ్ఛందంలోనే వ్రాస్తున్నాను.

మిత్రులు B. N. రెడ్డిగారు "సామాన్యుని సందేశం" అని తన ఈ కవితా సంపుటికి పేరుపెట్టారు. వారి సందేశం నిజంగా అసామాన్యంగానూ, అనితరసాధ్యంగానూ, అశేష పాఠకలోకాన్ని ఆకట్టుకునేదిగానూ ఉన్నప్పటికీ, నమ్రతవలన అనుకోండి, లేక తాను లక్షలాది సామాన్యులలో ఒకడను అనేభావనవలన కానివ్వండి, తన సందేశం ఎవరో పర్వత శిఖరాగ్రం నుంచి వినిపించేదికాక ప్రజా హృదయాలలోనుండి తనరూపంగా వెలువడేదిగాభావించి గానివ్వండి, అలాంటి సామాన్యమైన పేరుపెట్టివుంటారు.

నాకు ఒకానొకనాడు రచనలోని ఆడంబరాలమీద మోజువుండేది. ఇవాళ అదిపోయింది వేమన పద్యాలు చదివినప్పుడు, భర్తృహరి సుభాషితాలు పఠిస్తున్నప్పుడు, ఖలీల్ జిబ్రాన్, గాలిబ్, టాగోర్ అలతి అలతి పంక్తులలోని గంభీరార్థాన్ని ఆకళించ ప్రయత్నిస్తున్నప్పుడు—సర్వాభరణ భూషితమైన సంపన్న రమణీమణిగాక సామాన్య స్నానసుందరివంటి కవిత నాకు సాక్షాత్కరిస్తుంది.

బి. ఎన్. రెడ్డిగారి "ప్రార్థన" చదువుతుంటే నాకు డా. సర్ మహమ్మద్ ఇక్బాల్ కవిత "దుఆ" జ్ఞాపకం వచ్చింది.

"హే భగవాన్ !" అని ప్రారంభిస్తారు బి. ఎన్. గారు

"ఇమ్ము సజ్జన సహవాసమే
సకలవేళల
సాహసమునిమ్ము
సత్కార్యములుచేయ
దొడ్డగుణములనిమ్ము
దానధర్మములుచేయ
నేర్పుతో ఓర్పుమీర
కష్టపడి కార్యములుసాధించ
ఆత్మధైర్యమ్మునిమ్ము
అవసరమైన శక్తియుక్తులనిమ్ము"
"తొలగింపుము ఈమహిలో
అజ్ఞానం - అంధకారం"

" వెలిగించుము దివ్యజ్యోతులు
నీ విశాల ప్రపంచమందు"

భగవంతుణ్ణి " ఇట్లాచేయి అట్లాచేయి " అనడంతోపాటు తాను మంచిని సాధించడానికి శక్తిని ఇమ్మంటున్నారు బి. ఎన్. గారు. తాను లోకానికి ఉపయోగపడేలా, కష్టపడి కార్యములు సాధించేలా చూడమంటున్నాడు

"ఇల్మెకీషమ్మ" అన్నాడు ఇక్బాల్
"దివ్యజోతులు" అన్నారు రెడ్డిగారు

"సంవాదినో మేధావినాం బుద్ధయః" - మేధావుల ఆలోచనలు ఒకేరీతిగా వుంటాయి. బి ఎన్. రెడ్డిగారు ఇక్బాల్‌ను చదివిఉండరు. కాని భగవంతుణ్ణి ప్రార్థించినప్పుడు ప్రతిభాశాలి, దయాగుణ సంపన్నుడు, విశ్వ సౌభ్రాత్రవాది - తన దేశంలోను, ప్రపంచంలోను దివ్యజ్యోతులు వెలిగించ మనే భగవంతుణ్ణి ప్రార్థిస్తాడు.

మిత్రులు బి. ఎన్. రెడ్డిగారి కవితలో సున్నితమైన హాస్యం. సమాజంమీద చురుకులు, చెణుకులు కనిపిస్తాయి.

"కోరికలు కొల్లలు
చేతలు సున్నలు
మంచినాచరించం
మంచివాడి నాదరించం
దిగంబర వేషాలు
దిక్కుమాలిన తిరుగుడులు
అక్కరకురాని వాగుడులు
ఎటుచూచినా
ఎటు వెళ్ళినా
కొదువలేదు నినాదాలకు
స్వాతంత్ర్యం - సామ్యవాదం
సమానత్వం - సౌభ్రాతృత్వం
ఇవన్నీ ఎలా సాధ్యం ?"

ఈ కవితలో satire వుంది సత్యంవుంది, నినాదాలమీద ఈసడింపు -పరులను అనుకరించేవారిపై ఈసడింపు-ఎన్నో వున్నాయి.

బి ఎన్. గారు తనకవితను ఎంత స్నానసుందరిలా, అలంకార రహితంగా, చూపదలచినా, సహజమైన అందాలు వాటంతటవే కనపడుతూనే వుంటాయి. అప్రయత్నంగా దూకే యతిప్రాసలు, అంత్యప్రాసలు కొత్త సొగసులను దిద్దుతాయి. అట్లని ఆయన బలవంతంగా - యతి కోసం మతి చెడగొట్టుకునే మనిషి కాడు ! వేమన యతులకోసం తాపత్రయ పడ్డాడా ! అవే దాసోహంఅంటూ వచ్చాయి

విచక్షణ, వివేచన బి. ఎన్ గారి రచనలలో అంతటా కనిపిస్తాయి. "అహింసా సూత్రానికి అర్థం" అన్నచిన్న కవితలో – ఆహింస అవసరమే పామునుకాదు దోమనైనా చంపకూడదు. నిజమే. కాని మానవుడు రాక్షసుడై అన్యాయం అక్రమం తలపెట్టినప్పుడు - అహింస బోధించడమా !

" ఒక చెంపమీద కొట్టినప్పుడు
మరొకచెంప చూపమన్నారు."

బాగానే వుంది. కాని మనలోని ఆ అహింసా తత్వాన్ని అర్థం చేసుకోనప్పుడు ఏం చేయాలి ? బి ఎన్. గారు అంటారు.

"......ఆ సూత్రం పనిచేయ నపుడు
ఆ కొట్టిన వాడి రెండు చెంపలు
పగుల గొట్టడమే న్యాయం

నేను కవిగారితో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. మన శాంతి, సహనాల విలువ తెలిసిన వారి వద్దనే వాటికి గౌరవం. అది లేనప్పుడు మనం ఎదురు తిరగవలసిందే. మన దేశ స్వాతంత్ర్యాన్ని మట్టు పెట్టదలచిన శత్రువు ఎంతటి వాడైనా, ఆయుధం చేతబూని పోరాడి మన స్వాతంత్ర్యాన్ని రక్షించుకోవలసిందే. దేశాన్ని శత్రువులకి అప్పగించం సుమా ! మనం పోరాడుతాం.

తాను యువకుడైనా యువకులు చేసే బాధ్యతా రహిత, అనాగరిక చర్యలను చూసి ఉద్రిక్తుడౌతాడు బి. ఎన్.

ఒక రోమియో
రోడ్డు పైన వెడుతూ
ఆకు నమిలి వూశాడట
దారిని పోయే ఒక అమ్మాయిపైన
ఎంత అందంగా వుందీ సరసం ?"

అని రోమియోలను ప్రశ్నిస్తున్నాడు కవి. ఇది సరసం కాదు విరసం. ఇది శృంగార చేష్టకాదు, పశు ప్రవర్తన

యువకవి శ్రీ బి యన్ గారు స్పృశించని విషయం వుందా అని పిస్తుంది ఆయన రచనలు చదువుతున్నప్పుడు. మనం చిన్న విషయాలను కొని దాటేసుకుపోయే వాటిలో ఎన్నోవిశేషాలను చూడగల విమర్శనా నేత్రాలు, పరిశీలనా నయనాలు, వివేచనా ధోరణులు ఆయనలో కోకొల్లలు

ఇలా నేను మా బి. యన్. కవితను గురించి చెప్పుతూ పోతే—నా పీఠిక ఆయన పుస్తకమంత అవుతుంది.

నేను బి. యన్. కవిత చదివి ఎక్కువగా ఆకర్షితుణ్ణయింది— అందులో కనిపించిన ఆయన అతికోమల, నవనీతసమాన, కరుణామయ హృదయం.

కవి బి. యన్. రెడ్డి గారి "సామాన్యుని సందేశం" చదివిన తరువాత అప్రయత్నంగా నాకు — కవి గెథేని గురించి Mathew Arnold అన్న మాటలు జ్ఞాపకం వస్తున్నాయి।—

"He took the suffering human race
He read each wound, each weakness clear
And struck his finger on the place
And said thou ailest here and here."

వ్యథిత మానవజాతి గాయాలని పరిశీలించి, వేదనను అర్థం చేసుకుని— ఇదిగో ఇక్కడవుంది నీబాధ ఇక్కడవుంది నీరుగ్మత, అనివేలు పెట్టి చూప గలవాడు కవి. ఆపని గెథీచేశాడు. బి. యన్. చేస్తున్నాడు. ఎక్కువ తక్కువ లేమీలేవు. గెథీ ప్రపంచప్రఖ్యాత మహాకవి కావచ్చు. మా బి. యన్. ఉదయోన్ముఖుడైన వర్ధమాన కవికావచ్చు. పర్వతంలో పర మాణువులో పదార్థం ఒకటేకదా! అయితే బి. ఎన్, రుగ్మతచూపడంతోపాటు ఘాటు చికిత్సకూడా చెప్పాడు. అది మా బి. యన్. ఘనత.

వాల్మీకి, కాళిదాసు, గెథీ తమ కర్తవ్యాన్ని నిర్వహించి పోయారు పోతూ మనకర్తవ్యాన్ని మనకు జ్ఞాపకం చేసిపోయారు. మానవలోకం ఉండేదాకా ఈ కవితా గంగా ఝురి ప్రవహిస్తూనే వుంటుంది. మనం నిమిత్తమాత్రులం.

ఆతల్లి కవితా సరస్వతి మా బి. యన్. రసనాగ్రంమీద ఆసీను రాలై ఉన్నది. వ్రాయిస్తున్నది. మా బి. యన్. కలం ఆకవితా సరస్వతీ వీణ. మా బి. యన్. రచనలె ఆవీణా తంత్రీస్వనాలు. వాటిని విని ఆనందిం చగలవారు ధన్యులు. అవి మనస్సుకు ఆరోగ్యాన్నిస్తున్నాయి.

వాస్తువు నెరిగిన మా బి. యన్. ప్రతివస్తువునూ, పరిశీలించి అర్థం చేసుకుని, దాన్ని కవితామయంచేసి అందిస్తున్నాడు. మా మిఠాయి పుల్లారెడ్డిగారి పేరూలోనూ చమత్కారం చూపాడు నాకెంతో సంతోష మైంది.

"పుల్లన్న అని పేరున్నా
తీపన్న గా మారగలిగే
పుల్లన్నలను
స్వీటు పుల్లన్నలను
ఊరూరికీ సృష్టించవయ్యా" అంటున్నారు కవిగారు.

నాహృదయాన్ని కదిలించిన పంక్తులలో ఇవికొన్ని ఇలాంటి పంక్తులు ఉదాహ రిస్తూపోతే—ఆపాత మధురమూ, ఆలోచనామృతమూ అయిన మా బి. యన్. కవితలో, విడిచిపెట్ట వలసింది ఏదీకనపడదు. అందుకే నా ఉపో

ప్రాతం దీర్ఘమైంది. ఇంకా వ్రాయాలని వుంది. కాని ఒక్క విషయం ఇక్కడ పాఠకులకు మనవి చేయాలి. బి. యన్ గారి కవితలోని మాటలు చిన్న చిన్నవిగా అందరికీ తెలిసేవిగా సామాన్య మైనవిగా కనపడతాయి. కిప్లింగ్ అన్నట్లు.

"Words are the most powerful drugs used by men." ప్రతి మాటా రస గుళిక సమాజంలోని రుగ్మతను పోగొట్టే ఔషధ గుళిక. బి. యన్ వ్రాసిన చిన్న చిన్న కవితలు ఎన్నెన్ని ఆలోచనలను రేకెత్తిస్తాయి? A tiny poem throws a gigantic shadow. నిజం పాఠకులు మళ్ళీ మళ్ళీ మా బి. యన్. రెడ్డిగారి సందేశం (సామాన్యుని సందేశం) చదివి గంభీరార్థాలను అవగతం చేసుకుంటారని ఆశిస్తాను. ఆర్కిటెక్టు, పొయెట్ కావటంలో ఆశ్చర్యం లేకపోలేదు. కాని అసాధ్యం కాదు, ఆర్కిటెక్టూశిల్పి. కవీశిల్పి. ఇరువురిలో విజ్ఞానజ్యోతి వుంది.

ఆధునిక ఆంధ్ర కవితాకాశంలో మరో నూతన తార నిరాఘాటంగా ప్రకాశించ సాగింది అదే బి. యన్ గారి భావధార. పాఠకులు, విమర్శకులు, పెద్దలు, పిన్నలు అంతా మా బి. యన్. కవితను సహృదయతతో పఠించి ఆదరిస్తారని ఆశిస్తాను. బి యన్ రెడ్డిగారి కలం నుంచి పుంఖాను పుంఖంగా రచనలు వెలువడ గలవని విశ్వసిస్తాను

మద్రాసు
16-2-76

డా॥ దాశరథి

# సామాన్యుల్లో అసామాన్యుని కవిత

డాక్టర్ ఆరిపిరాల విశ్వం

కవిలోని మనిషి చచ్చిపోయి కవిత మిగుల్తుంది కొందరిలో మరికొందరిలో కవి మరణించి-వట్టిమనిషి మిగుల్తాడు. కవీ, అతని లోపలి మనిషీ పెరుగుతూ వ్రాయబడే కవిత ఎప్పుడో ఎక్కడో తప్ప పుట్టదు.

కవిత్వాన్ని నిజమని భ్రమింపజేసే కవులుకొందరు. నిజాన్ని కవిత్వంగాపలికే కవులు మరికొందరు. వేదన, వేగం, నిశ్శబ్దం, శబ్దం, ఆర్తి, సౌందర్యం. ఓ మాటలో చెప్పాలంటే జీవునివేదన కావాలి కవిత.

వేదనలోనే స్పందన-స్పందనలో సంగీతం-సంగీతంలోలయ - లయలో సౌందర్యం-సౌందర్యంలోంచి అనుభూతి ఇదే కవితాశిల్పం.

రాసినకవిత అంతా రాశిలో పెరగవచ్చు. సభలో చదవవచ్చు. విన్నవాళ్ళు మొగమాటానికి వినవచ్చు. తర్వాత మర్చిపోవచ్చు. పుస్తకాలసంఖ్యనుబట్టి, సన్మానాల జాబితానుపట్టి. అవార్డుల ఆవర్జాని పట్టి, పట్టగల అవకాశాలనుపట్టి కొందరు కవులు కాదు కాదు మహా కవులై మోహరిస్తున్నారు. కవిత్వంపేర మామూలుకవాల్ని క్రుమ్మరిస్తున్నారు. 'నన్నయనించి—నాదాకా' అని చాటుకొంటు న్నారు. మరికొందరు 'నన్నయ్యని బొందలోపెట్టి' తామే చిర కాలం మిగలనున్నట్లు కాగితాలకాసనాలు వేసుకుంటున్నారు. ప్రచారం చేసుకుంటున్నారు. ఇదీ ఆధునిక కవితావేదిక - ఓ అహం కారపు అరణ్యమై అందులో అల్లిబిల్లిగా అల్లుకొన్న Confusion కథ-Ego ప్రదర్శనం.

విప్లవంపేర కొన్నిగురుపీఠాలు

కులంపేర మరోకొన్ని-వచనకవితపేర మరోకొన్ని-వెనక బడిన తనంచేత వేరొకకొన్ని సంస్థలసృష్టి, ఆధిపత్యంచేత మరోకొన్ని సనాతనత్వంచేత మరోకొన్ని - ప్రచారసంస్థలు, ప్రచురణసంస్థలు, అకాడమీలు పత్రికలు వీటిలో కీలకస్థానాల్లోఉండడంచేత మరికొన్ని; డబ్బెక్కువై పంచేయాలో తెలీక కవితరాసి ప్రచురించేగురుపీఠాలు వేరొకకొన్ని, ఇన్ని Monopolies కవితా పరిశ్రమలో ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా ఏర్పడ్డాయి.

ఈనాడు యీ దేశంలో కవిగా పైకిరావాలంటే పైన చెప్పిన ఏదో గురుపీఠానికి నీవు సృష్టికర్తవో—

శిష్యపరమాణువో-దాసానుదాసుడవో అయిఉండాలి. లేదా కాంపిటీషన్‌లో నీ కవిత ఓ శ్రమ. దానికి పరిగణనరావటం (నీవు దానికై పడితే) ఓ పెద్దభ్రమ.

వ్యక్తిత్వాన్ని, విలువల్ని, లోపలిమనిషిని చంపుకో.'అడియేన్ దాసోహం' నీ Ego కి తృప్తియివ్వాలంటే.

కవిత్వం నేడొక 'పట్టు'పరిశ్రమ

ఏంకావాలన్నా ఎవణ్ణో ఒకణ్ణి పట్టుకోవాలి. 'పట్టు' కొన టంలో కవిత్వం పట్టుపోవచ్చు, అయినా పట్టుపట్టే అనే చిదంబర రహస్యాన్ని, గురువులనుంచీ ఉపదేశంగాపొంది కవిత్వపుపట్టుని మాటల గారడీగామార్చి చప్పట్లుకొట్టించుకోవటానికి తంటాలుపడే కవులసంఖ్య పెరిగినపుడు ఎప్పుడో ఎక్కడో మరుగుపడిన మాణిక్యాలై కొంతమంది మనిషికవులు ఎప్పుడూ యీ గుంపుకీ— యీ త్రోపులాటకి దూరంగా ప్రశాంతంగా తాము పెరుగుతూ పరిణతిదీపంగా కవితని వెలిగిస్తారు. వాళ్ళు ప్రచారంకోసం పడవరు. పరిగణనకోసం పాటుపడరు లోకంలో యింకాఉన్న మంచితనం ఎప్పుడో ఒకప్పుడు ఆ కవితని సొంతంచేసుకుంటుంది. అదేఅనుభూతి కవిత. భవిష్యత్ కవిత. పేరులేని కవిత. అచ్చమైన ఆంతరికకవిత. మనిషిపడే వేదనకి మారుమాట ఆ కవిత.

# జీవితపుఎడారిలో ఒయాసిస్ కవిత

సోదరుడు B. N. వృత్తిచేత కవికాదు. ప్రవృత్తిచేత మనిషి. అందులోనూ ప్రతి చిన్నగాలికీ తలవూపే చిగురుటాకుమనస్సుకల మంచిమనిషి. ఆ మనస్సు తీగకిపూసిన ఓపువ్వు యీ కవిత. తపన లోంచి వచ్చే కవిత అనుభూతినే సహజసౌందర్యంగా చేసుకొని పుడుతుంది. శబ్దాలంకారాలగొడవ సింగారం దానికి అక్కరలేదు. నిజాన్ని నిజంగాచెబితే వినేవాళ్ళు ఒప్పుకునేవాళ్ళు ఎంతమంది? నిజంచెప్పటానికి సాహసించే చిత్తస్థైర్యంఉన్న కవులెంతమంది? నిజమనితెలిసినా దాన్ని పూడ్చిపెట్టి అబద్ధాలకి అందమైన రంగులు వేసి, తమ పబ్బంగడుపుకునే కవులకోవలోకి చెందడు B. N.

నమ్మింది చెప్పగలగాలంటే నీలో దృఢమైన నమ్మిక ఉండాలి. అది ఆలోచనతో కలసి జీవిత మార్గాన్ని పరచే అభిప్రాయం కావాలి అప్పుడే కవియొక్క కవితలో తనమయత ఉంటుంది. అదిలేని కవిత వట్టి మాటలపోగు ప్రాసప్రయాస. శబ్దాలమోత చమత్కారపురోత వర్ణాల వర్ణనల కూత. చెవికి యింపైన కవిత కంటె—మనసుకింపైన కవిత—అచ్చమైన కవిత. అందులో ఆలోచన ఉంటే ఆకవిత నీచేత ఆలోచింప చేస్తుంది. సోదరుడు B. N. సామాన్యుల్లో అసామాన్యుడు అసామాన్యుల్లో సామాన్యుడు. అందుకే వినయంతో తన కవితకు సామాన్యుని సందేశం అన్నాడు. ముఖచిత్రం కూడా—సృష్టి రహస్యాన్ని - విశ్వ శక్తి మర్మాన్ని- ఈ రెండింటి మానవ్యాఖ్యకి ప్రతీకగా వేయించాడు.

సామాన్యుని సందేశం లోని కవిత గలగలా పారే సెలయేటి అందాల్ని సంతరించుకొన్నది . మనిషిమీద నమ్మకం ఉండాలంటే తనమీద ముందు తనకో నమ్మకం ఉండాలి . అది ఆకాశమంతఎత్తు ఆదర్శమై, దర్శనమై, చిరంతన ఐక్యాన్ని కోరి దైవంమీది నమ్మకంగా మారుతుంది . అప్పుడు మనిషి తన అల్పత్వాన్ని, తెలుసుకొని వినయంతో ప్రకృతి శక్తిముందు, దివ్యశక్తిముందు నతశిరస్కుడౌతాడు. అలాంటి కవితే ప్రార్థన అందులో భగవంతుణ్ణి శాంతసహ

నాకిమ్మంటాడు. విచక్షణాజ్ఞానం ఇమ్మంటాడు ఆహంభావం చేరనీకు మంటాడు.

**నినాదాలంటే తనొప్పి. ఈ కవికి.**

"మంచి నాచరించం" మంచివాడి నాదరించం "మన సోదరుడిబాగు సహించం" "అక్కరకురాని వాగుడులు" యీ నినాదా లంటాడు.

కాస్త ఇతరుల మంచినికూడా నీ మంచితో జోడించమని అడుగుతాడు 'నీవాళ్ళనే పొడుచేంత విడనాడి. న్యాయ పరిష్కారమే చేయండి' అంటాడు.

**అహింస అంటే చేతకానితనం కాదు.**

ఒక చెంపను కొడితే - అవతలివాడి రెండు చెంపలూ వాయించి - వాడి అహాన్ని తుదముట్టించు. అదే ఆధునిక అహింస. నీకై నీవు హింసకు కాలుదువ్వకు. నీలాంటి హక్కే ఇతరులకీ ఉంది ప్రతికేందు కని గమనించు.

'ఒకడి బాగుకొరకు ఇంకొకడిని
బలిచేయని - నిస్వార్థంలో నుండే
స్వార్థాన్ని పిండుకోండి !

ఇదే సామాన్యునికి మరో సామాన్యుని సందేశం. మనోబలం లేకపోతే మనుగడ సాగదని. ఏ బలం ఉన్నా మనోబలం లేకపోతే లాభంలేదనీ సందేశం.

'ఈ సమాజంలో మానవుడు
తెలిసి కొన్ని — తెలియక కొన్ని
తెలివి రాకముందే మరికొన్ని
మంచిచెడ్డలు నేర్చుకుంటున్నాడు''

ఈ వలలో చిక్కుకున్న మనిషికి విముక్తి కావాలి? అదే ప్రశ్న ఆ ప్రశ్నకిసమాధానం ఎవరికివారే సమాధానం తేల్చుకోవాలి.

రేపటిఉదయం ఒడ్డున
సరి క్రొత్త సూర్యుడు ఉదయించుతాడప్పుడు

కవితకి ఆదర్శం అందమైతే – వాస్తవంవస్తువు. జీవితం కాన్వాసు. అనుభవాలు రంగులు నీ దృష్టిరూపం.

'ప్రేమించడం తప్పుకాదు
ద్వేషించడం అవివేకం
అభిమానం చూపగూడదనికాదు
దురభిమానం పనికిరాదని'

సంయమనం–జీవనసత్యాలకి కాంతినిస్తుంది. ఎక్కడఆగాలో తెలిస్తే ఎంతవరకు సాగాలో తెలిసినట్లే.

'అమృతహృదయం పెంచుకో
అమృతాన్నే పంచిపెట్టు'

ఇంతతీయని సృష్టిని మనిషి తనస్వార్థంతో విషపూరితం చేస్తున్నాడని కవి ఆవేదన.

## సోదరుడు B. N. వృత్తిచేత వాస్తుశిల్పి

కవితా ప్రవృత్తిచేత వస్తుశిల్పి. గతం అంతా మూర్ఖతకి గుర్తుకాదు. ఆధునికంఅంతా ఆచారయోగ్యంకాదనే సమన్వయ వాది యీ కవి. అందుకే వాస్తుశాస్త్రంపైన కవితరాశాడు.

స్వేచ్ఛపైన చక్కని వ్యాఖ్యానం చేశాడు.

'స్వేచ్ఛనుకోరే
స్వేచ్ఛాజీవులారా
స్వేచ్ఛ అందరిహక్కని తెలుసుకోండి
మీ స్వేచ్ఛకు హద్దులేర్పరుచుకోండి

బాధలూ, బాధ్యతలూ వద్దు. స్వేచ్ఛకావాలంటే దొరకదు. హక్కులడిగేముందు అవతలివాని హక్కునుగమనించు. నీ స్వేచ్ఛ కోసం మరొకణ్ణి బానిసగా చేయకు.

నీవెప్పుడో చిన్నప్పుడు ఇంతపెద్దవాడివి కానప్పుడు రూపాయి దొరికితే వెయ్యికన్న మిన్న అనుకున్న అవస్థల రోజులో నీవుపైకి రావాలని కోరుతూ నీకు సహాయంచేసిన వ్యక్తుల్ని కృతజ్ఞతా పూర్వకంగా చూడటం ఉత్తమసంస్కారం.

'మిఠాయి పుల్లన్న' అన్న కవిత B. N. హృదయదర్పణం. మిఠాయి పుల్లారెడ్డిగారితో తనకున్న స్నేహాన్ని, ఆయనలో ఉదాత్త గుణాలనీ, గుప్తదానాన్నీ తెలిపే కవితయిది. వ్యక్తిగతం కావచ్చు. ఏదోరకంగా కవితఅంతా నీ భావాల, అనుభవాల, ఆదర్శాల, ఊహాలసంపుటియేకదా !

'ఓ మనిషీ
మనిషిగా బ్రతకటం నేర్చుకో
మనిషంటే మంచి
మనిషంటే మమత
మనిషంటే మానవత'

ఇవి B. N. జీవితంలోంచి వచ్చిన అభిప్రాయాలు. అచరించే వాళ్ళకి వాస్తవాలు మిగిలినవాళ్ళకి ఆదర్శాలు.

సాంఘిక దురాచారాలపైన చైతన్య క్రాంతిరథం నడిపిస్తాడు యీ కవి. వరకట్నాలు వద్దంటాడు. బాధ్యతారహితంగా నాయకుల్ని ఊరికే దుమ్మెత్తిపోయక, వాళ్ళచేత నీ భవిష్యత్తుకు బాటలువేయించుకునే నేర్పు అలవరుచుకోమంటాడు.

**'నక్సలిజం' యీ కవికి నచ్చదు**

అనాధల్ని సమసమాజపు మెట్లపై నిలపాలని భాధ్యతా రహితంగా, ఆవేశపూరితంగా జరుపుతున్న హింసాకాండలో మరి కొంతమంది అనాధుల్ని సృష్టించటం మినహా ఒరిగేదిలేదని స్పష్టం చేస్తాడు.

తన జీవితధ్యేయాన్ని కవి యిలాచెప్పుకుంటాడు.

'అందే సౌధాలన్నీ అందుకొని
ఎక్కగలిగిన మెట్లన్నిఎక్కి
మెట్లకింద వున్నవారిని మరిచిపోకుండా
వారినిపైకి లాగడానికి
శాయశక్తులా ప్రయత్నించాలని
ఆఖరిరోజులలో

ఆధ్యాత్మిక చింతన అలవరుచుకొని
మానసికానందం పొందాలని
—ఆశిస్తూ

భగవంతుణ్ణి, యివన్నీ అందుకోగల శక్తి సామర్థ్యాలనిమ్మని ప్రార్థిస్తాడు. ఇతరులని, నిచ్చెనగా ఉపయోగించుకొని ఎక్కవలసిన ఎత్తులన్నిఎక్కి మరొకరెవరూ మళ్ళీ ఆ పనిచేయకుండా, ఆ నిచ్చెనని లాగివేసే ప్రబుద్ధులున్న యీ లోకంలో గతాన్ని గుర్తించుకొని భవిష్యత్తుకు బాటలు పరచుకొంటూ మనిషిగా అందునా హృదయమున్న మనిషిగా బ్రతకాలని భావించటం మరీమంచిమనిషి చేసే ఆలోచన-అదే ఈ కవిత.

'ఏదో ఒక మంచిపని చేశామని గుండెమీద చేయివేసుకొని బ్రతకగల స్థైర్యం కావాలని కవి తపన.

'స్త్రీ స్వాతంత్ర్యం'లో వెర్రితలలువేస్తున్న, ఆడా, మగా స్వాతంత్ర్యాన్ని నిశితంగా, విమర్శిస్తాడు స్త్రీలకి మనవిచేస్తాడు.

'మీ అనుమానాలు మానుకొని
మనసులు పాడుచేసుకోక
వున్నస్వాతంత్ర్యాన్ని
సద్వినియోగం చేసుకొని
మగవాడికున్న స్వాతంత్ర్యాన్ని
కొంతవరకు అరికట్టి
దారితప్పి వెళ్ళేవాళ్ళను
సరియైన మార్గంలోకి త్రిప్పుకొని
మీ జీవితాలు స్వర్గమయం చేసుకోండి
ఆ స్వర్గంలో మాకూ
కాస్తచోటివ్వండి

ప్రేమతో, సహనంతో, సూటిగా, సామాన్యంగా చెప్పుతూ అసామాన్యమైన ఆప్యాయతని అందిస్తాడు కవి.

క్యాపిటలిజం సృష్టించే అవినీతి, అసమానత, దోపిడి, మోసాలపై కవి కాంతి ఖడ్గపువేటు ఎలాపడిందో చూడండి.

బియ్యంలో-నెయ్యిలో
నూనెలో-తేనెలో
ఉప్పులో-పప్పులో
పసుపులో-పాలడబ్బాలో
ఒకటేమిటి ?
ప్రజలకు పనికివచ్చే
ప్రతిపదార్థంలో కల్తీయేనా ?

యీ పెట్టుబడిదారులు చేసే కల్తీవ్యాపారాన్ని ఖండిస్తూ చివరకు ప్రాణరక్షణకుపయోగించే ఔషదాలలో కూడా కల్తీకలిపి ప్రజల ప్రాణాలుతీసి సంపాదించేడబ్బు ఒక డబ్బా ? అనిప్రశ్నిస్తాడు

యీ కల్తీలు, నల్లధనం, నల్లబజారు, పన్నుల ఎగవేత ఒకటేమిటి యీ వ్యవస్థచేస్తున్న యీ దారుణాలగురించి వ్రాస్తూ—

మీరు పరోక్షంగాతీసే ప్రాణాలే
ప్రత్యక్షంగా నేడు జరిగేహత్యలకు కారణం.

మనకి చివరికి కావలసింది ఆరడుగులస్థలం దీని కోసం ఇంత దారుణ హత్యకాండ, పరోక్షంగానూ ప్రత్యక్షంగానూ చేయకండి. "నీవు చేసిన తప్పులకు నీ అంతరాత్మకు సమాధానాలు దొరకవు. నీకు నిద్రరాదు. నీ గుండె గంట మ్రోగి మ్రోగి ఒక్క క్షణంలో ఆగిపోతానని భయపెడతుంది. నీ భయాలే నిన్ను హత్య చేస్తాయి. అందుకే మనిషిలా బ్రతుకు. మరో మనిషి మనుగడని ఆనందమయంచేయి. నీకు ప్రణతి మళ్ళీ నీకు వినతి అంటాడు. B. N. ఈ కవిత కవియొక్క విశ్వ సౌమనస్య సమన్వయ సమతా వాదానికి నాయకమణి-న్యాయానికి మచ్చు తునక.

విద్యార్థి సోదరులకి వినతిచేస్తూ బాధ్యతలు తెలుసుకోమంటాడు విలువలు పెంచమంటాడు. నాయకత్వం అలవరచుకోమంటాడు. మంచినిచేసిన పెద్దలయెడ గౌరవం పెంచుకో మంటాడు. మంచిని ఎక్కడున్నా స్వీకరించ మంటాడు. భవిష్యత్తుకు బాటలు వేసుకో మంటాడు.

సామాన్యుని సందేశంలో అన్నింటికన్నా 'నా గురించి' అన్న కవితలో ఎంతో స్పందన 'తనమయత' కనిపిస్తుంది. చిన్నప్పుడు తన తల్లి 'అర్భకుడుగా తాను పుడితే—తనని బ్రతికించుకోవటానికి ఎన్ని అవస్థలు పడిందో ఆ అమ్మహృదయాన్ని పంచుకొని పుట్టిన యీ పుత్రుడు ఆమెకి నివాళులిస్తాడు.

### "సామాన్యుని సందేశం"లోని కవిత

ఇజాల కవిత కాదు. నిజాల కవిత.
సహజమైన సామాన్య కవిత.
నిజమే, దాని సౌందర్యం,
దర్శనయే దాని బలం.
సమతా, మమతలు జాలువారే అమృతం.
సోదరుడు నాకు పరమాప్తుడు.
అతడు కవిగా పుట్టడీనాడు.
ఇది అతని కవితాజన్మదినోత్సవం.
ఇలాగే—ఇలాగే—ఇంకా రాయాలని
అతనిలోని తపన—క్రాంతిదీపాల్ని
వెలిగించాలనీ— ఆశిస్తూ—

భవదీయ—

**అరిపిరాల విశ్వం.**

# కృతజ్ఞతలు

ఎంతో విలువైన తమ సమయాన్ని నా కొరకు కేటాయించి అమూల్యమైన సలహాలనిచ్చి హృదయపూర్వకంగా తన అభిప్రాయాలను వ్రాసిపెట్టిన డా॥ అరిపిరాల విశ్వంగారికి —

అనారోగ్యంతో బాధపడుతున్నప్పటికీ నాల్గు గంటలు ఓపికగా కూర్చుని నా కవితనంతావిని దాన్ని ప్రపంచంలోని ప్రముఖ రచయితలతో పోల్చి నా కింతటి అర్హతలున్నవా అని ఆశ్చర్య పడేలా పీఠిక వ్రాసియిచ్చిన డా॥ దాశరథిగారికి —

భావగర్భితమైన ముఖచిత్రాన్ని రూపొందించిన శ్రీ కె. శేషగిరిరావుగారికి—

ముఖపత్ర ముద్రణచేసిన న్యూ విస్టాస్ ప్రింటర్స్‌కి—

నా పుస్తకాన్ని తమ పుస్తకంగా భావించి అందంగాఅచ్చు వేసి ఇచ్చిన శ్రీ వరలక్ష్మీప్రెస్ యాజమాన్యానికి—

ఎన్నిసార్లు మార్చినా ఓర్పుతో పనిచేసిన వారి సిబ్బందికి—

ఎప్పటికప్పుడు నా భావాలను వ్రాసివినిపించినప్పుడు సహృదయతతో నిర్మాణాత్మకమైన సలహాలిచ్చిన నా మిత్రులు ఎ. ఆనంద మోహన్, రాజారాందాసు మరియు సుభాష్‌చంద్రగార్లకు—

**నాహృదయపూర్వక కృతజ్ఞతలు**

**—వి. యస్. రెడ్డి**

# విషయసూచిక

# ప్రార్థన

హే భగవాన్ !
నీ సాన్నిధ్యంలో నిలుచుని
నిను శరణు వేడుచుంటి
నీ దయాదాక్షిణ్యముల కెంతో
కృతజ్ఞత తెలుపుకొనుచుంటి.
కరుణించి ప్రసాదించు
ఆరోగ్యం - ఆనందం
శాంతి సహనము లనంతంగా

ఇమ్ము సజ్జన సహవాసమే
సకల వేళల
సాహసము నిమ్ము
సత్కార్యములు చేయ
దొడ్డ గుణముల నిమ్ము
దాన ధర్మములు చేయ
ఇమ్ము విచక్షణా జ్ఞానమ్ము
చెడు విడనాడి మంచినే చేయంగ
అహంభావము చేరనీకు నాలో
అసూయా ద్వేషాలు ప్రబలనీకు నాలో
కోపతాపములు మాని
నేర్పుతో ఓర్పుమీర
కష్టపడి కార్యములు సాధించ
ఆత్మధైర్యమ్ము నిమ్ము
అవసరమైన శక్తియుక్తుల నిమ్ము

సామాన్యుని

తొలగింపుము యీ మహిలో
అజ్ఞానం - అంధకారం
తొలగింపుము యీ భువిలో
అన్యాయం - అక్రమం
శిక్షించుము కక్షగట్టి
కయ్యానికి కాలుదువ్వే దుర్జనుల నెల్ల
రక్షింపుము మారణాయుధముల వాత పడకుండ
ప్రపంచములోని ప్రజల నెల్ల
స్థాపించుము శాంతి భద్రతలు
నా భరత ఖండమందు
నెలకొల్పుము సుఖశాంతులు
ఖండఖండాంతరములందు
వెలిగించుము దివ్య జ్యోతులు
నీ విశాల ప్రపంచమందు.

# ఎలా సాధ్యం?

కష్టం చేయం
క్రమశిక్షణ ఎరుగం
కోరికలు కొల్లలు
చేతలు సున్నలు
మంచి నాచరించం
మంచివాడి నాదరించం
మన బాగునాలోచించం
మన సోదరుడి బాగు సహించం
దిగంబర వేషాలు
దిక్కుమాలిన తిరుగుడులు
అక్కరకురాని వాగుడులు
ఎటు చూచినా
ఎటు వెళ్ళినా
కొదువలేదు నినాదాలకు
స్వాతంత్ర్యం - సామ్యవాదం
సమానత్వం - సౌభ్రాతృత్వం
ఇవన్నీ ఎలా సాధ్యం ?

# మతిలేని కొత్తరకం జాతి

వారునవ్వితే మనకు ఏడ్పొస్తుంది
వారు ఏడిస్తే మనకు నవ్వొస్తుంది
మంచిని చెడుఅంటారు
చెడును మంచి అంటారు
తానుపట్టిన కుందేటికి మూడే కాళ్ళంటారు
హద్దులు చెప్పాల్సిన సమయంలో
జోకులు విసురుతూంటారు
ఏమీలేని దగ్గర
సందేహాలు సృష్టిస్తారు.
తనతో పనిపడివచ్చిన వాడిని
పదిమార్లు తిప్పించుకుంటారు
ఎదుటి వాడి బాధ
వారికెన్నడూ అర్థంకాదు
వాళ్ళేం మనుషులో
వాళ్ళేం మతులో
ఎలాంటి నిద్రావస్థలో
భగవంతుడు వారిని సృష్టించాడో **మరి?**

# స్వార్థంలో నిస్వార్థం

కావాలి నాకు ఐశ్వర్య ప్రాప్తి
రావాలి నాకు పరువు ప్రతిష్ఠలు
పుల్లయ్యకు మంత్రిపదవి
అతని కొడుక్కి కలక్టరుగిరి
రంగయ్యకు రత్నఖనిజాలు
రామయ్యకు రాజపూజ్యత
ప్రతి మనిషికీ
ప్రతి పనిలో స్వార్థచింతన
కాని—
నాకు ప్రమోషన్ కోసం
నీకు తీరని అన్యాయం
నాకు అధికారం కోసం
ఎదుటి వాడు హతాహతం
నాకు డబ్బుకావాలని
నీ ఇంట్లో కన్నం
నా కూతురు పెళ్లి కొరకు
మరో ఆడకూతురు జీవితాన నిప్పులు
మన స్వార్థానికిదే అర్థమయితే
అదిమహా పాపం
మానవ జాతికది
సర్వనాశనశాపం !
అమ్మా! ఆకలి అన్నవాడికి
మీ అన్నంలో కొంత పెట్టండి

అయినవాడి కొరకు కాని వాడిని
కష్టాలపాలు చేయకండి
న్యాయ సింహాసనం పై కూర్చున్నపుడు
నీ వాళ్లనే పాడు చింత విడనాడి
న్యాయ పరిష్కారమే చేయండి
ఒకడి బాగుకొరకు ఇంకొకడిని
బలిచేయని - నిస్వార్థంలో నుండే
స్వార్థాన్ని పిండుకోండి.

# అహింసా సూత్రానికి అర్థం

ఒకరిని కొట్టడం
మరొకరిని తిట్టడం
చీమను చంపడం
పాము ప్రాణం తీయడం
దారిని పోయేవాడిని
దండించడం
నిర్దోషిని నిందించడం
విధిగా విసర్జనీయం.

కాని—
చీమ కుట్టినపుడు
పిల్లి పాలు త్రాగినపుడు
పాము కాటు వేసినపుడు
మానవుడు రాక్షసుడై
అన్యాయం అక్రమం తలపెట్టినపుడు
కళ్లు పూడిపోయి
అహంకారంతో విర్రవీగినపుడు
తప్ప త్రాగి తన వాళ్లనే
తన్ని తగిలేసేటపుడు
డబ్బు కక్కుర్తితో ప్రక్కవాణ్ణి
హతమార్చినపుడు
అహింస బోధించడమా ?

ఒక చెంప మీద కొట్టినపుడు
మరొక చెంప చూపమన్నారు.
కాని ఆ సూత్రం పని చేయనపుడు
ఆ కొట్టిన వాడి రెండు చెంపలు
పగుల గొట్టడమే న్యాయం.

# అందరం భారతీయులం

ప్రపంచంలోని
ప్రతి దేశంలో
ప్రతి వారికి
సమస్యలున్నాయి

నిరక్షరాస్యత
నిరుద్యోగం
ఆర్థిక అసమానత్వం
అపారమైన స్వార్థం
గొప్పగొప్ప పదవులకొరకు
దిక్కుమాలిన డబ్బుకొరకు
ప్రాకులాడేవారి పగటి కలలు
తలపెట్టే ఘోరకృత్యాలు
చేసే దారుణాలు
వచ్చే పరిణామాలు
ఇవీ మన సమస్యలు.

పార్టీలు-మతాలు
జాతిమత భేదాలు
భాషా సమస్యలు
ఎవరికివారే-యమునాతీరే

మనుష్యులలో మమత
అయినవాళ్ళమధ్య అనురాగం
సహృదయత-సౌభ్రాతృత్వం
అన్నీ కొరవడినట్లుంది

అందుకే మనకు
కొంచెం శాంతం
కొంచెం మంచితనం
కొంచెం నిస్వార్థం
కాస్త విచక్షణా జ్ఞానం
ఎంతైనా అవసరం.
మనదేశ భవిష్యత్తు కొరకు
మానవాళి సంక్షేమం కొరకు
మనలో ఐకమత్యం పెరగాలి
మనమంతా అన్నదమ్ములం
మనమంతా భారతీయులం
అనే భావం ప్రబలాలి.

# తెగిన గాలిపటాలు

ఒక రోమియో
రోడ్డుపైన వెడుతూ
ఆకు నమిలి వూశాడట
దారిని పోయే ఒక అమ్మాయిపైన
ఎంత అందంగా వుంది సరసం ?

బస్సు స్టాపులో కొంగులాగడం
బస్సులోపల కాలు త్రొక్కడం
సినిమాహాలులో సిగలాగడం
కాలేజిలో కాగితాలందించడం
ఒంటరిగా కనిపిస్తే - వెంట బడటం
ఇవి మన రోమియోలు చేసే
వింతైన కొన్ని సరసాలు

చదువు సంధ్యలకు స్వస్తి చెప్పి
పనిపాట్లు మానుకొని
పనికిరాని చిలిపి చేష్టలతో
పరవశించి పోతుంటారు

ఇలా చేసే వాళ్లలో
బీదవాళ్ల బిడ్డలు
ధనవంతుల తనయులు
ఉద్యోగస్తుల సుపుత్రులు
అందరూ వుంటారు
వాళ్లకూ అక్కచెల్లెళ్లుంటారు

వారికేమైనా జరిగిందంటే
సహించలేరు
కోపమొస్తుంది
తాపమొస్తుంది
తంతానంటాడు
చంపేస్తానంటాడు

పర్వాలేదు - మనలో
పౌరుషం చావలేదు
మరి ఏమిచచ్చింది?
విచక్షణా జ్ఞానం

మనదైతే బంగారం
మనది కానిది మట్టితో సమానం

ఆనందించడం
సరదాగా బ్రతకడం
అందరి జన్మహక్కే
కాని——
మీ అల్ప సంతోషాలకొరకు
విలువైన సమయాన్ని వ్యర్థం చేసుకొని
తెగిన గాలిపటాలుగా మారి
మీ జీవితాలు నాశనం చేసుకోకండి
మిము కన్న తల్లిదండ్రుల్ని
ఇబ్బందులపాలు చేయకండి

# పద్ధతి

మాట్లాడినా
మౌనంలోవున్నా
నిల్చున్నా
కూర్చున్నా
నిద్రలోవున్నా
జాగ్రదవస్థలో వున్నా
మనం చేసే
ప్రతి పనికీ
ప్రతి యత్నానికీ
ఒక పద్ధతి వుండాలి.

# శేషప్రశ్న

అర్జునా! ఆపుము
నీ వ్యర్థ ప్రలాపము
యుద్ధము చేయననే
నీవింత వాదన
వృధా కాలయాపన
బంధువులని, మిత్రులని
పాపమని, పాపాన్ని ఒడికట్టలేనని
రణరంగమంతా
రక్తమయం చేయలేనని
ఏమిటీ నిర్జీవమైన మాటలు
నిర్వీర్యమైన చేష్టలు

లెమ్ము - ధరింపుము విల్లు
ప్రమోగించుము - విజయభేరి
నీవు చేయు ప్రతి కర్మకు
నీవే కర్తనను కొనుచుంటివా ?
అదంతా నీ భ్రమ
నీవు కేవలం నిమిత్తమాత్రుడవు
ఇదంతా నా మాయ
అని చూపెట్టెనట
తన విశ్వరూపం
మన ధనంజయునకా
కృష్ణ భగవానుడు

అయితే—
మనమంతా ఈ జగన్నాటకమున
నటించే వేషధారులమే కదా
ఆ సూత్రధారుడి
అజ్ఞానుబంధులమే కదా
ఆ కరుణామయుని
బిడ్డలమే కదా

మరి అలాంటపుడు-
నేను చేసినది తప్పేమిటి ?
నీవు చేసినది ఒప్పేమిటి ?
ఒకడు దొంగేమిటి ?
ఒకడు దొరేమిటి ?
ఒకడు రాజేమిటి ?
మరొకడు రాక్షసుడేమిటి ?
ఒక నింట్లో కనకధనరాశులు మూల్గుటేమిటి
మరొకడింట్లో గంపెడు పిల్లలమూల్గుల బాధలేమిటి?

ఒకడేమో విజ్ఞాని
మరొకడు అజ్ఞాని
ఒకరు పతివ్రత
మరొకరు వేశ్య
ఒకరికి సన్మానాలు - పూలమాలలు
మరొకరికి జైళ్లు — ఉరిత్రాళ్లు

ఒకడు పరీక్షలో ఫస్టు
పరీక్షలో తప్పి ఆత్మహత్యా పాల్పడ్డాకడు
ఒకడిని సంఘం హర్షించడం
ఇంకొకడి నదే సంఘం గర్హించడం
ఏమిటి స్వామీ ఇదంతా ?
పూర్వజన్మ సుకృతమా ?
లలాట లిఖితముల ఫలితమా ?
ఆ జన్మలన్నీ నీ విచ్చినవి కావా ?
ఆ జన్మల విధి వ్రాతలు నీవు వ్రాయలేదా ?

ఏమిటీ మాయాజాలం తండ్రీ ?
మనుషులను మనుషులుగా
గుర్తించలేని యీ ప్రపంచంలో
ఈ అమాయకుల మధ్య
ఈ అజ్ఞానుల మధ్య
ఈ అధికార ధనమదాంధుల మధ్య
మానవత్వం లేని యీ
మానవాధముల మధ్య
ఎలా బ్రతకాలి ?
ఎంతకాలం బ్రతకాలి ?
ఎందుకని బ్రతకాలి ?

# బాధ్యతలు

మనం పుట్టినప్పటినుండి
మట్టిలో కలిసేవరకు
ఎన్నో అనుభవాలు
ఎన్నో అనుభూతులు
ఎన్నో బాధ్యతలు
కొన్ని ఆనంద సమయములు
కొన్ని దుఃఖ సమయములు

మన జీవితాలు సాఫీగా
సాగి పోవాలంటే
చివరి ఘడియలలో
చీకూ చింతా లేకుండా
శరీరాలు చాలించాలంటే
మన పిల్లలు పెరిగి పెద్దవారై
ఆనందమయ జీవితం గడపాలి

మన పిల్లలలోనే
కొందరు రౌడీలు
కొందరు బుద్ధిమంతులు
కొందరు అజ్ఞానులు
కొందరు విజ్ఞానులు
కొందరు వినయ విధేయతలు కలవారు
కొందరు మంచి మర్యాద తెలియనివారు
తయారవుతున్నారంటే

వారి తల్లిదండ్రులమైన మన మీద
ఎంతటి మహత్తరమైన బాధ్యతవుందో
మీరే ఆలోచించండి

వ్యాపారంలో పడి
ఉద్యోగ భారంలోపడి
గుఱ్ఱపు పందాల మోజులోపడి
క్లబ్బుల్లో కాలక్షేపం చేస్తూ
కుటుంబ వ్యవహారాలు మరిచి
పిల్లల విద్యా బుద్ధులపై శ్రద్ధచేయక
వారికి కౌమారంలో క్రమశిక్షణ లేక
యౌవనంలో సంయమనం లేక

స్కూళ్ళకు, కాలేజీలకు
డుమ్మాలు కొట్టి
పరీక్షలు వ్రాయక
అల్లర్లు నేర్చుకొని
సమ్మెలు చేసి
వారు చెడిపోతుంటే

మనకు మనశ్శాంతి పోతుంది
వారి భవిష్యత్తు పాడై పోతుంది.

నేటి మన పిల్లలే
భావి భారత పౌరులు

కన్న బిడ్డలను
క్రమపద్ధతిలో పెంచి
బాధ్యతాయుత వ్యక్తులుగా
తయారు చేయకపోతే
సోమరిపోతులుగా మారి
వ్యసనాలకు లోనై
వారు సమాజానికి
చీడపురుగులుగా
బ్రతుకుచుంటే
మనమెలా చూడగలం ?
మనసమాజ మెలా భరించగలదు ?

# జీవిత ధ్యేయం

ఈ ప్రపంచంలో పుట్టినవాళ్లలో
కొన్ని కోట్లప్రజలు
అనారోగ్యులై జీవచ్ఛవంలా బ్రతుకుతున్నారు
రాత్రింబవళ్లు కష్టపడికూడా
కనీసపు అవసరాలు తీర్చుకోలేకపోతున్నారు
సమాజంలోని పనికిమాలిన
పద్ధతులకుగురై కృంగి కృశించి
శరీరాలను చాలిస్తున్నారు.

కొందరు సంపాదించిన దానిని
సద్వినియోగం చేయలేక
దాచుకోలేక
-నిద్రరాక
మానసికావేదనకు
ఆహుతి అయిపోతున్నారు
మరికొందరు ఎంతో శ్రమపడి
ఆశాసౌధాల పైకెక్కి
అంత ఎత్తునుండి మళ్ళీ
క్రిందపడి పోతున్నారు.

అలాగే అనుకున్నవి కొన్నైనా
జీవితంలో సాధించాము అని
సంతృప్తికరంగా
మృత్యుముఖాన ఇంత

దరహాసం పారవేసిన
వాళ్లెందరున్నారు ?

అభివృద్ధి పొందిన దేశాలలో కానీ
వెనుకబడిన దేశాలలో కాని
ఎక్కడైనా సామాన్య మానవుని
సమస్యలు తీరనే లేదు.
పాశ్చాత్య దేశాలలో వ్యక్తి స్వాతంత్ర్యం
ఎక్కువై ఏడుస్తుంటే
కమ్యూనిస్టు దేశాలలో
వ్యక్తిస్వాతంత్ర్యం లేదని
బాధ పడుతున్నారు

బీదవాడి గుడిసె గాలివానకు
ఎగిరిపోతుందేమోనని భయం
ధనవంతుడి ధనం ఇన్‌కంటాక్సు
బాకీల క్రింద పోతుందేమోననే భయం
ఒకనాయకుడికి మంత్రి పదవి లేదనే బాధ
మంత్రి పదవిలో ఉన్నవారికి
వున్నది వూడిపోతుందేమో అనే ఆవేదన
పెద్దవారికి పెద్దసమస్యలు
చిన్నవాడికి చిన్న సమస్యలు
ఇలా సమస్యలతో పుట్టినమానవుడు
సమస్యలతో అంతం అవుతున్నాడు

మరిలా మనమంతా
ఎందుకు పుట్టామో తెలియక
ఎందుకు బ్రతుకుతున్నామో అర్థంకాక
పడరాని పాట్లుపడుతూ
ఇంకా ఇంకా బ్రతుకాలనే
పాడువ్యామోహంలో పడటం
యీ దుర్భరమైన
జీవితాలను అనుభవించడానికే అయితే
మన తలిదండ్రులు మనకీ
జన్మ లెందుకిస్తున్నారు?
మళ్ళీ మనం పెళ్ళిళ్లు చేసుకొని
ఎందుకీ సంతానాన్ని పెంచుతున్నాం ?
దీనికో దారిలేదా ?

ఉంది !

బుద్ధుడు
మహావీరుడు
మనకు జ్ఞానబోధచేయలేదా ?
మనిషి-మనిషిగా ఎలాబ్రతుకాలో
వివేకానందుడు చెప్పలేదా ?

జగద్గురు శంకరాచార్యుడు
మానవజాతికి మార్గం చూపలేదా ?
గాంధీ మహాత్ముడు
మంచి మార్గాలనుసరిస్తూ
ప్రాణాలర్పించలేదా ?

మనంవారి అడుగుజాడలలో నడిచి
వారు చెప్పిన సూత్రాలను
కొంతవరకైనా పాటిస్తే
మానవాళికి మంచి జరుగదా ?

# మనోబలం

యీకలియుగంలో జరుగుచున్న
వింతలు—విడ్డూరాలు
చేస్తున్న మోసాలు
చూస్తుంటే మనస్సు దహించుకుపోతుంది

తిండిలేదు-సహించగలం
బట్టలేదు-బ్రతుకగలం
చదువులేదు-నేర్చుకోగలం
సంస్కారంలేదు-నేర్పించగలం
కాని మనోబలం లేకపోతే
ఏమిచేయగలం ?
ఆత్మకు ద్రోహంచేసి
నిజాన్ని హత్యచేసి
మనస్సులో ఒకమాట
మనిషి ముందరొకమాట
ఇంట్లో ఒకమాట
ఇంటి వెలుపల ఒకమాట
గద్దెఎక్కి ఒకమాట
గద్దెదిగి ఒకమాట

ఎందుకింత ఆత్మవంచన ?
ఎందుకీ అబద్ధపుహార్మ్యనిర్మాణాలు ?

దేశాభ్యుదయానికా ?
ప్రజా బాహుళ్య మనుగడకా
మన పిల్లా బిడ్డల సంక్షేమమునకా
మరి ఎందులకీ తప్పుడు మార్గాలు ?

మానాభిమానములు వదలుకొని
అయినది కాదని
కానిది అవునని
తనమీద నమ్మకంపోయి
దేవుడిమీద నమ్మకంపోయి
ఆత్మాభిమానం చంపుకొని
ఎదుటివాడి ముఖస్తుతిచేసి
ఇంకేదో చేసి-ఇంకేదో చేసి
ఏమిటి సాధించేది ?

డబ్బా ?
పదవులా ?

ఇవన్నీ శాశ్వతమా ?
ఈ అబద్ధాలపైన ఎన్ని మేడలు కట్టగలము ?
ఎన్ని గద్దెలు ఎక్కగలము ?

ఒకనాడు పునాదులు లేని
యీ కొంపలు కూలిపోతే
ఆ గద్దెలు విరిగిపోతే
మనమంతా అథఃపాతాళానికి జారిపోమా ?

జాతి పతనమై
దేశం నాశనమై
భూమి నరకమై
మానవజాతి మంటగలిసిపోదా ?

# నా దేశం

నా దేశం
నందనవనంగా
నయనమ్ముల కానందంగా
ప్రకృతి సౌందర్యంతో
పచ్చిక బయళ్లతో
పాడి పంటలతో
కళకళ లాడాలని....

అన్ని జాతులు
అన్ని మతములవారు
ఆరోగ్యవంతులై
అన్ని సౌకర్యములు కలిగి
కష్టాల కతీతంగా
హాయిగా జీవించాలని....

బలహీన వర్గాల వారికి
కనీసపు అవసరాలు
కల్గించడానికి
ప్రభుత్వం ప్రయత్నిస్తుంటే
అదృష్టంకొద్ది అన్ని సౌకర్యములు
కలిగిన మనమంతా
శక్తి వంచన లేకుండా
సహాయం చేయాలని

ఒక నాడు వారందరూ
మనలో ఐక్యమైపోయి
వారి కలలు ఫలించి
ఆనందంతో పరవశించి పోవాలని....

నా దేశంలో పుట్టిన
నా సోదరులంతా
ప్రేమ స్వరూపులై
ఆత్మీయత పంచుకొని
అనుబంధముల పెంచుకొని
దురాశలు చంపుకొని
అసూయా ద్వేషములు వదలుకొని
సాటివారిని హీనంగా చూసే
మనస్తత్వం మార్చుకొని
అభిమానం పెంచుకొని
ఆత్మబలం పుంజుకొని
మంచికి పునాది వేయాలి
అంతా ఆనందమయం కావాలి

అప్పుడే పండగలవు జాతిపిత
గాంధీ తాత కన్న కలలన్నీ
అప్పుడే అవుతుంది నా దేశం
ఆనందనందనం.

# కోరికలు

అందమైన
అనుకూలమైన
చదువు సంస్కారం కలిగిన
భార్యకావాలని
ఉద్యోగంకానీ
వ్యాపారంకానీ
పని చేసుకుని
ఇల్లు చేరేటప్పటికి
ఇల్లాలు ఆనందంగా
స్వాగతం పల్కి
సరదాగా మసులుకోవాలని
ఆ ఆనందంలో
పడినశ్రమంతా
మరచిపోవాలని
ప్రతిమగవాడు కోరుకుంటాడు.

కోరికల కొన్ని వింతలే మంటే—
అయ్యగారు ఇంటికిరాగానే
అమ్మగారు చేసేపని విడిచిపెట్టి
బూట్లు విప్పాలి
సూట్లు విప్పాలి
రాత్రి పార్టీకెళ్ళి
పన్నెండు గంటలకొస్తే

భోజనం చేయకుండా
వేచియుండాలి.
మోతాదుకు
మించివారు పట్టించివస్తే
ఇంత మజ్జిగవారి కడుపులోపోసి
పాన్పు మీద పడుకోపెట్టాలి.

పాపం ఆ ఆడకూతురు
ఆ రాత్రి భోజనం చేసిందో లేదో
అయ్యవారికి తెల్లవారేదాకా తెలియదు.
మనకు ఇప్పటికీ తెలియదు.

ఆ! యీరోజుల్లో ఇవన్నీ ఎవరు చేస్తున్నారు.
ఇంటికెళ్ళగానే భారతం మొదలెడ్తున్నారు
కొందరు భర్తల–భరతం పడుతున్నారు
అంటే అదికూడ అక్కడక్కడ
జరుగుతూనే వుందంటాను.

మరికొందరు
తమ సతీమణి స్టైలుగా లేదని
ఐదునిమిషాలలో రెడీకాలేదని
ఆరవనిమిషంలో కాఫీ ఇవ్వలేదని
క్లబ్బు కెళ్దామంటే ఆమెకు డ్యాన్సురాదని
భలే బాధపడుతున్నారు.

అయ్యా !
మీరు కోరుకునే స్టైల్సు నేర్చుకున్నవారు
అనేకులున్నారు.
వ్యవహారాలన్నీ చకాచకా చేసుకుపోయేవాళ్లు
చక్కగా ఇంగ్లీషు మాట్లాడే వాళ్లు
నిమిషాలపైన కాఫీలందించేవాళ్ళు
బాల్ రూం డ్యాన్సులు నేర్చుకున్నవాళ్ళు
ఇంటికి అతిథులొస్తే చక్కగా
మర్యాదలుచేసేవాళ్ళు
ఇవన్నీ వారు మోతాదుకు
మించి ఎక్కడ చేస్తారో అని
ఆదుర్దా పడుతూంటారు.
కొందరు కాపలా కాస్తుంటారు

అందుకే
లేనివాటి కొరకు బాధ పడకుండా
వున్నవాటితో సంతృప్తి పడండి.
భార్య చక్కగా ఇల్లుదిద్దుకొని
పిల్లలకు విద్యా బుద్ధులు నేర్పుతుంటే
మీ విలువైన సమయాన్ని
వ్యర్థం చేసుకోకుండా
చిటికి మాటికి చిందులు తొక్కకుండా

ప్రేమానురాగాలు పంచుకొని
ఔన్నత్యాన్ని–ఔదార్యాన్ని అలవర్చుకొని
భార్యాభర్తలిద్దరూ కలసి
సంసార నౌకను సాఫీగా
నడుపుకోండి.
ఆదర్శ దంపతులుగా బ్రతకండి

# మద్యపానం

విరహానికి విరుగుడు కావాలని
కవిత్వానికి "మూడ్" రావాలని
కయ్యానికి జోరుకావాలని
ప్రేమకలాపాలకు కైపుకావాలని
త్రాగుతున్నారిమద్య
ఆడామగా అంతా

కొన్నాళ్ళక్రితం
కొన్ని ప్రాంతాలలో
ఇళ్ళలో త్రాగడం
త్రాగి ఇళ్ళకెళ్లడం
అపరాధం అనుకునేవారు
త్రాగినవాణ్ణి చూస్తే
అసహ్యించుకొనేవారు
కాని ఇప్పుడు
జల్సాలు పార్టీలు
త్రాగడం తందనాలాడడం
పెద్దవాళ్లకు ఆనందం
యువకులకు సరదా

కొన్ని కొన్ని పార్టీలలో
కొందరి మనస్తత్వం మరీవిచిత్రం
ఎదుటి వాడిని చిత్తుగా
త్రాగించే వరకు వదలరు

చేయిపట్టి త్రాపిస్తారు
పండ పెట్టిపోస్తారు
చివరకు వాణ్ణి కార్లో పడుకోపెట్టి
ఇంట్లో దిగవిడుస్తారు

మరికొందరు
పీకల వరకు త్రాగి
లేటుగా ఇంటికెళ్లితే
పెళ్లాం గోలపెడుతుంది
ఒళ్ళు చెడిపోతుంది
పిల్లలముందు సిగ్గు పోతుంది
అలా నాల్గుసార్లు జరిగితే
ఆ మనిషి విలువే పడిపోతుంది

మధ్యపానం నిషేధించడానికి
కొన్ని ప్రభుత్వాలు ప్రయత్నిస్తుంటే
'బార్లు' వదిలేసి
ఎక్కడెక్కడో త్రాగుతున్నారు
అసలు దొరక్కపోతే
నకిలీ త్రాగుతున్నారు
చివరకు విషద్రవాలు త్రాగి
ప్రాణాలు పోగొట్టు కుంటున్నారు

ఈ సమాజంలో మానవుడు
తెలిసి కొన్ని తెలియక కొన్ని
తెలివి రాక ముందే మరికొన్ని
మంచి చెడులు నేర్చుకుంటున్నాడు

అందుకే ఒక వేళ మనం
పరిస్థితుల ప్రభావం వలన కానీ
మరే కారణాలవలన కానీ
త్రాగడం తప్పని సరైతే
త్రాగవలసిన మోతాదులో
సమయా సందర్భాలు చూసుకొని
ఆరోగ్యాలు చెడిపోకుండా
వేరే ఇబ్బందులు రాకుండా
త్రాగాలి కానీ
మితిమీర త్రాగి
కైపెక్కి-నిషాలో
కళ్ళు మసకలు క్రమ్మి
దారి తెలియక గోతుల్లో పడి
పరువు ప్రతిష్టలు బజారు పాలు చేసుకోకండి
ప్రమాదాలు చేసి ప్రజల
ప్రాణాలు తీయకండి

# స్వాతంత్ర్య దినం

నేడే –
స్వాతంత్ర్యం వచ్చిన దినం
సంకెళ్లు విచ్చిన దినం
భారతావనికి పర్వదినం
ఇంటినిండా జ్యోతులు వెలిగించి
గానంచేసి, నాట్యంచేసి
ఆనంద సాగరంలో తేలిపోవాలని పిస్తుంది

అంతే! ఆ మరుక్షణమే
ఏదో అర్థంకాని అసంతృప్తి
పడిన ఆనందం
పొందిన ఉత్సాహం
హారతి కర్పూరంలా హరించుకు పోతుంది
విద్యార్థులలో-నిస్పృహ
ఉపాధ్యాయులలో నైరాశ్యం
ఎన్. జి. ఓ లలో అసంతృప్తి
వ్యాపారస్తుల ఆక్రందన
అంతా అయోమయం

త్యాగం నశించింది
స్వార్థం పెరిగిపోయింది
నీతులు బోధిస్తున్నాం
గోతులు తీస్తున్నాం
మోసాలు చేయవద్దంటున్నాం
చెప్పిన మరుక్షణం మనమేచేసేస్తున్నాం

ఒకనాడు దేశంకొరకు
ఎందరో బలి అయినారు
యీనాడు కొందరు
దేశాలనే బలిచేస్తున్నారు

దీనికి తోడు ప్రకృతి
విలయతాండవం చేస్తున్నది
ఒక రాష్ట్రం నీటి వరదలలో
నాశనమవు తుంటే
మరో రాష్ట్రంలో త్రాగే నీరే
కరువయి పోయింది
స్వాతంత్ర్యం సంపాదించి
ఇరువది ఏడు సంవత్సరాలైనా
దేశం సుభిక్షంకాలేదు
నిరుద్యోగ సమస్య తీరలేదు
పంచవర్ష ప్రణాళికలెన్నో వేసినా
ప్రాజెక్టులెన్నో కట్టించినా
ప్రజల సమస్యలు పరిష్కారంకాలేదు
పరదేశాలను యాచించడం తప్పలేదు
కోట్లకొలది రూపాయాలు వెచ్చించి
కుటుంబ నియంత్రణలు చేస్తుంటే
కోట్ల జనాభా పెరుగుతూనేవుంది

శరవేగంగా పెరిగే యీ జనాభా
ఆకసమంటుతున్న-యీ ధరలు

బలహీనవర్గాలవారి బాధలు
కార్మికుల కష్ట నిష్టూరాలు
సమ్మెలు "లే ఆఫులు"
బార్డరు సమస్యలు
నీటితగాదాలు
నల్లధనం - తెల్లధనం
తమాషాలు
ఏమిటా మనఅదృష్టం ఇలా
అయిపోయిందని బాధపడుతుంటే

మనదేశానికి శుభగ్రహాల
శుభదృష్టి తక్కువ
పాపగ్రహాల ప్రభావం ఎక్కువ
అన్నాడొక జ్యోతిష్కుడు

ఉత్తరమున కొండలు
దక్షిణమున-సముద్రమున్న
మనదేశానికి మంచిరోజులు
ఎలావస్తాయి
అన్నాడొక వాస్తు శాస్త్రజ్ఞుడు

ఈ శాస్త్రజ్ఞులు చెప్పినదే నిజమైతే
మానవుడు పడే ప్రయాస తాపత్రయం
అభివృద్ధికి రావాలనే అభిలాష అదుర్దా

అంతావృధా యేనా
అని నిరుత్సాహంతో
కృంగి పోయిన సమయంలో

లేదు —

అలా కావడానికి వీలు లేదు

రేపటి ఉదయం ఒడ్డున
సరిక్రొత్త సూర్యుడు దయించి
చీకట్లను పారద్రోలి
వెలుగులను ప్రసరించి
మందారములను పూయించి
నదీనదాలను నడిపించి
పాడి పంటలను పండించి
మనందరికి ఆనందం-ఆహ్లాదం
అందిస్తాడని
నా అంతరాత్మ ఘోషిస్తున్నది.

# ఫైళ్ళు

తోటి మానవుడు
పనిపడి వెడితే
పలుకడు-ఉలుకడు
పదిసార్లు వెళ్ళినా
ఫైలు దొరకదు
దొరికినా కదలదు
వచ్చినవాణ్ణి చూచి
పోజులు పెడతాడు
కుర్చీవున్నా కూర్చోమనడు
పనిఏమిటని పలుకరించడు

ఇదే ఫోజులరాయుడు
తనస్వంత పనిమీద
వేరే ఆఫీసుకెడితే
అక్కడింకొక రాయుడుంటాడు
అతనూ ఫోజులు పెడతాడు
ఫైలు వెదకడు
దొరికినా కదపడు
ఆ రూల్సు అలాగు
ఈ రూల్సు ఇలాగు
నీ పనిచేయడ మెలాగ? అంటాడు

బ్రదర్స్
ఎందుకు యీ ఫోజులు ?

ఈ ఉద్యోగాలు–యీ ఫోజులు
ఏ "ఎమర్జన్సీ" క్రిందనో రాలిపోవచ్చు
ఏ "ఎంక్వైరీ" క్రిందనో వూడిపోవచ్చు

ఫైల్సు కదిపే సోదరులారా
మీరుచూసే ఫైల్సు
మీ సోదరులవే
మీ ప్రభుత్వం మీ సోదరులదే
మీ సోదరులు చెల్లించిన
శిస్తులు సుంకాలే
మీ జీతాలు
మరి వారి అన్నింతిని
వారిపని చేయకపోతే ఎలా ?

ఫైలు కదిపే ప్రతిక్లర్కు
బిల్డింగు పునాదిలాంటివాడు
చెట్టుకు వేరులాంటివాడు
మరి అలాంటివాళ్లు
చక్కగా పనిచేసినపుడే
పై వాళ్ల తీర్పులు
న్యాయబద్ధంగా వుండగలవు
సకాలంలో పనులు నెరవేరగలవు

లేనివాడు
మనసోదరుల ఇబ్బందులు తీరవు
మనసమస్యలకు పరిష్కారం జరుగదు
దేశభవిష్యత్తు మారదు
పెద్దవాళ్ళుచెప్పే పెద్దపెద్దమాటలు
మాటలుగానే వుండిపోగలవు

మన అమాయకత్వానికి
మన అవివేకానికి
మనమంతా బలైయెపోగలం.

# కులమతాలు

కులమతాల కతీతమైన
ఒకదేశం కావాలని
ఒకేభాష ఒకేజాతి
ఒకేమాట-ఒకేబాట
కావాలసి-కావాలని
ఎంతోమంది వ్రాశారు
వేదికలెక్కి చెప్పారు

చెప్పినదొకటి-జరిగినదొకటి
ఆశించినదొకటి
అవతరించినదొకటి
తగదని చెప్పినవాటికే
తగనంత ప్రచారమైనది
కులమతాలపైన దురభిమానం ప్రబలినది

రెడ్డి చాటున రావు
రావు చాటున రెడ్డి
వెల్మ చాటున కమ్మ
కమ్మ చాటున వెల్మ
ఆంధ్ర చాటున తెలంగాణా
తెలంగాణ చాటున ఆంధ్ర
మెజారిటీ వాళ్లొకచోట
మైనారిటీ వాళ్లొకచోట
ఏమిటీ గుసగుసలు?

రెడ్డి రెడ్డిని ప్రేమిస్తేతప్పా ?
రావు రావునాదరిస్తేతప్పా ?
హరిజనులొక చోటజేరి
వారి సమస్యలను చర్చిస్తేతప్పా?

తండ్రి తన బిడ్డను ప్రేమించడా ?
అన్న తన సోదరుడి బాగునాలోచించడా?
తన వాళ్ళను ప్రేమించలేనివాడు
ఇతరులను ప్రేమించగలడా?
తనతల్లి బాధతీర్చలేనివాడు
మరోమాతృమూర్తి నోదార్చగలడా?
ఎందుకింత రాద్ధాంతం?
ఎందు కీరసాభాసలు?

ఇదేనా మనం ఆశించినది?

నో! నో!
ప్రేమించడం తప్పుకాదు
ద్వేషించడం అవివేకం
అభిమానం చూపకూడదని కాదు
దురభిమానం పనికిరాదని
అయినవాడి నాదరించడం
అన్యాయంకాదు

కానివాడిని దూరం చేయడం
ధర్మం కాదు
సంకుచిత భావాలువిడనాడి
సౌభ్రాతృత్వాన్ని పెంపొందించి
సాటిమానవుణ్ణి ప్రేమించు
మానవత్వాన్ని కౌగిలించు.

# మంచిని పంచు

ప్రజలలో పుట్టి
ప్రజలలో పెరిగి
విద్యనేర్చుకొని
విజ్ఞానం సంపాదించి
ఉత్సాహవంతుడై
తనవారినుద్ధరించడానికి
తానేమైనా చేస్తానని
ప్రజలమధ్యకు వెళ్ళి
వాగ్దానాలుచేసి
ప్రమాణాలు చేసి
ప్రజానాయకుడుగా మారి
ఓట్లు వేయించుకొని
ప్రజాప్రతినిధిగామారి

చూస్తుండగానే
హంగులు మార్చుకొని
రంగులు మార్చుకొని
తనప్రజలను మరచిపోయి
వారికిచ్చిన వాగ్దానాలను మరచి
తాను పెరిగిన పరిస్థితుల మరచి
పేదప్రజల స్థితిగతులు మరచి

స్వార్థం పెరిగిపోయి
బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తుంటే
అదిచూడలేని ప్రజలు
ఇదిమీకు తగదంటే
తన అధికారం నిలబెట్టుకోడానికి
ఎన్నో ప్లాన్లు వేస్తున్నాడు
ఎన్నో దారుణాలు చేస్తున్నాడు

ప్రజానాయకా
ప్రజా ప్రతినిధివీవు
ప్రజా సేవ నీ ధ్యేయం
ప్రజలు నీ బిడ్డలు
వారి క్షేమం చూస్తావని
వారి బాధలు తీరుస్తావని
నీకు ఓట్లు వేసి
నిన్ను గెలిపించి
గంపెడాశతో
నీ కెదురు చూస్తుంటే
నీకు తీరిక లేదని
"హైపవర్" మీటింగులని
అంతకంటె ముఖ్యవిషయాలున్నాయని
ప్రజలకన్యాయం చేయదగునా?

సోదరా ఇదినీకుతగదు
నీ పద్ధతి మార్చుకో
నీ మనస్సును మార్చుకో
నీ స్వార్థాన్ని పరిమితంచేసుకో

మమతను పెంచుకో
మంచిని పంచిపెట్టు
అమృతహృదయం పెంచుకో
అమృతాన్నే పంచిపెట్టు
నీ ప్రజలమధ్యకువెళ్ళు
వాళ్ళ బాధలుతీర్చు

అలాచేసిననాడు
దేవుడు అనుగ్రహిస్తాడు
ప్రజలు ఆనందిస్తారు
బ్రతికితే జీవితానికోతృప్తి
చస్తే ఆత్మకుశాంతి.

# వాస్తు శాస్త్రం

ఈశాన్యంలో నుయ్యి
ఆగ్నేయంలో పొయ్యి
తూర్పు ఉత్తరములు పల్లం
దక్షిణ పడమరలు ఎత్తు
ఈశాన్య భాగంలో ఖాళీస్థలం
నైఋతిలో ఎత్తైన భవనం

ఇలా శాస్త్రోక్తంగా
గృహ నిర్మాణంచేసి
దానిలో నివసించువారికి
అనుకున్నంత ఆనందం
అవసరానికిమించిన ఐశ్వర్యం
అన్ని లభించునని
వాస్తుశాస్త్ర పండితుల వాదం

ఈశాన్య ముఖద్వారం సర్వశ్రేష్టం
ఆగ్నేయ ముఖద్వారం అరిష్టం
ఈశాన్యంలో పూజాగది సర్వజన సమ్మతం
ఇతర దిక్కులలో అది అనుచితం
ఆగ్నేయం పల్లమైతే
అర్ధాంగికి అనారోగ్యం
ఈశాన్యం ఎత్తయిన
అందరికీ వ్యాధులు
ఆపదలు-ఆర్ధిక ఇబ్బందులు

ప్లాటుకు ఈశాన్యం తగ్గితే
ఆడసంతానం ఎక్కువ
మగవారికి ఆయురారోగ్యాలు తక్కువ
ఇవి శాస్త్రజ్ఞులుచెప్పే
మరికొన్ని విశేషాలు

తిరుపతి వెంకన్నకు
పుట్టపర్తి సాయిబాబాకు
బ్రహ్మాండమైన శాస్త్రబలముంది
అందుకే ఆ దేవుడికి
ధనకనక రాసులు
బాబాగారికి వేలకువేలు భక్తులు
అని వాదిస్తున్నారు
కొందరు వాస్తుపండితులు

ఇన్నివున్నా ఇంటిగర్భం కొలతలు
ముఖ్యమంటారు కొందరు
ఎన్నిచేసినా మత్స్యయంత్రం
వేయాలంటారు మరికొందరు
వేయిదీపాలు వెలిగేచోట
వాస్తు పనిచేయదంటారు
కొందరు పుణ్యాత్ములు

గతినిపట్టి మతి
అన్నారు పెద్దలు

వాస్తు సిద్ధాంతానికి
కర్మసిద్ధాంతానికి
అవినాభావ సంబంధం
వుందంటారు విజ్ఞులు
కర్మ పరిపక్వమైనపుడే
వాస్తు కుదురుతుందని
అంటున్నారు
అన్నీ అనుభవించినవారు

వాస్తుశాస్త్ర పరిశోధనార్థం
జయప్రదంగా నడుస్తున్న
కొన్ని సంస్థలను
అధికారం-ఐశ్వర్యం
కలిగివున్న కొందరి గృహాలను
పరిశీలించినపుడు
వాస్తుబలం కనిపిస్తుంది

శాస్త్రాన్ని నమ్మనికొందరు
వారికి తెలియకుండానే
శాస్త్రానుకూలమైన
ఇళ్ళలో నివసిస్తున్నారు
మంచి ఫలితాలనుభవిస్తున్నారు

వాస్తుకు వ్యతిరేకమైన
కొన్ని గృహాలలో!

నివసించుకొందరు
అద్భుతమైన కార్యములు సాధిస్తున్నారు
దీనికికారణం
మనకు తెలియని మంచి ఇళ్లు
మరికొన్ని వారికుండవచ్చు
అని వాస్తుశాస్త్రజ్ఞుల అభిప్రాయం

ఏది ఏమైనా
యీ మధ్య మన రాష్ట్రంలో
యీ విద్యకు విలువపెరిగింది

అధికారులు-అనధికారులు
మంత్రులు-మతాధికారులు
అన్నివున్నవాళ్ళు
ఏమీలేనివాళ్లు
అధికారం కావాలని కొందరు
ఆర్థికంగా బలపడాలని కొందరు
వాస్తు ప్రకారం ఇళ్ళు
నిర్మించ కుంటున్నారు
సత్ఫలితాలనుభవించడానికి
ఉవ్విళ్లూరుతున్నారు

ఈ పరిస్థితులలో
వాస్తుశాస్త్రం నేర్చుకొని
"ఆర్కిటెక్టు"కు అన్నమే
కరువయ్యే టట్లుంది

వాస్తులో అవస్థలేమంటే
శాస్త్రప్రకారం ప్లానువేస్తే
వసతులు కుదరడంలేదు
వసతులు కుదిరించడానికి ప్రయత్నిస్తే
వాస్తు కుదరడంలేదు
వంటగది వుండవలసినస్థలంలో
పడకగది

"పోర్టికో" వుండవలసినచోట
పూజాగది

దానిప్రక్కనే మరుగుదొడ్డి
ఇవిరెండు ప్రక్క ప్రక్కనిషేధం
పాపం ఇల్లు కట్టుకునేవాళ్ళు
డిజైన్లు వేసేవాళ్ళు
శాస్త్రంమధ్య-శాస్త్రజ్ఞులమధ్య
ఎన్నిఇబ్బందులు పడుతున్నారో ?
అయినా—

ఈ వాస్తు శాస్త్రోక్తంగా
చెప్పగలిగినవాళ్ళుంటే
దానినిపాటించి మనమంతా
గృహనిర్మాణాలు చేస్తే
యు. పి. గవర్నరు గారైన
మర్రి చెన్నారెడ్డిగారు
సందేశమిచ్చినట్లు

దేశంలోని
ఇంజనీర్లు
ఆర్కిటెక్టులు
హావుజింగు బోర్డువారు
అర్బన్ డెవలపుమెంటు వారు
అందరూ శాస్త్రాన్ననుసరించి
కాలనీల ప్లాన్లు వేస్తే
ఇళ్ళు డిజైన్లుచేస్తే
మనందరికీ మంగళప్రదం
కాగలదని నా విశ్వాసం.

---

"వాస్తు" శాస్త్రీయ విజ్ఞానం అని విశ్వసించి దానిని ఆదరించి ఆచరిస్తూ ప్రజలకు దానివిలువ తెలియ జేస్తున్న యు. పి. గవర్నరుగారయిన డా. మర్రి చెన్నా రెడ్డిగారికి కృతజ్ఞతలతో..

# స్వేచ్ఛ

ఏమిటయ్యా నడిరోడ్డులో నడుస్తావు ?
అది నా యిష్టం
ఎందుకుబాబూ ఆడపిల్లల
నల్లరి పెడ్తావు ?
అది నా సంతోషం
ఎందుకయ్యా దారినివెళ్ళే
వారిపై రాయి విసురుతావు ?
అందులో ఆనందముంది
ఎందుకయ్యా తప్పత్రాగి
బజారులోపడి వుంటావు ?
నా డబ్బుతో నే త్రాగుతాను
నీవెవరు చెప్పడానికి ?
అర్ధనగ్నంగా
ఏమిటిది బజారులో ?
చూడలేక పోతే కళ్ళుమూసుకో

ఇదా మన స్వేచ్ఛ ?
ఇదేనా స్వేచ్ఛకు నిర్వచనం ?

స్వాతంత్ర్యం వచ్చింది
మనమాడింది ఆట
పాడింది పాటఅని
కొందరు వారివారి

హద్దుల నర్థం చేసుకోకుండా
హద్దుమీరి ప్రవర్తిస్తున్నారు
ఇతరులనిబ్బందిపాలు చేస్తున్నారు

స్వేచ్ఛవుందికదా అని
బాగాడోపు వేసుకొని
స్వేచ్ఛవుందికదా అని
నడిరోడ్డులో లారీనడుపుతూ
స్వేచ్ఛవుందికదా అని
కళ్ళుకూడ మూసుకుంటే
ఎదురుగావచ్చే బండిని ఢీకొని
పట్టుమని పదిమంది ప్రాణాలుపోతే
ఇవన్నీ చేయడానికి
నీకు స్వేచ్ఛవుందికాని
పాపం బ్రతుకడానికి
వారికేస్వేచ్ఛ లేదుకాబోలు

నడిరోడ్డులో నడిచే
నా ముద్దుల తండ్రీ
నీవెనుకవచ్చే స్కూటరువాడు
నీలాగే స్వేచ్ఛను కోరుకుంటే
నీనడ్డి విరుగుతుంది భాయీ

ఆడపిల్లల నల్లరిపెట్టే
అల్పసంతోషి

ఆ అమ్మాయి సాహసిస్తే
నీ చెంప ఛెళ్ళుమంటుంది
పోలీసువాడు చూస్తే
వీపు బ్రద్దలౌతుంది

భయభక్తులు లేకుండా త్రాగి
బజారులో అల్లరి చేసే బ్రదర్
కారునడిపే మరో సోదరుడు
కర్మకాలి త్రాగిన మైకంలో వుంటే
నీ యెముకలు పిండి కాగలవు
నీ భార్యాపిల్లల బ్రతుకులు బండలు కాగలవు

స్వేచ్ఛను కోరే
స్వేచ్ఛజీవులారా
స్వేచ్ఛ అందరి హక్కని తెలుసుకోండి
మీ స్వేచ్ఛకు హద్దులేర్పర్చుకోండి

మోతాదును మించితే
మధువే విషమై
అమృతమైనా హాలాహలమై
ప్రాణసంకటం కాగలదని గ్రహించండి.

# మిఠాయి పుల్లన్న

ఓ మిఠాయి పుల్లన్నా
నీపేరు పుల్లన
నీ మిఠాయి తీయన
నీ మాటెంతో ఘాటు
నీమనసెంతో స్వీటు
పెద్దచదువులు చదువకపోయినా
పెద్దడిగ్రీలు సంపాదించకపోయినా
పెద్దపేరు సంపాదించావు
విశాల హృదయాన్ని పెంచుకున్నావు
మన స్వీటు పుల్లన్నకు
కండబలముంది
గుండెబలముంది
కష్టం చేయమంటాడు
క్రమశిక్షణ నేర్చుకోమంటాడు
అధైర్యపడవద్దంటాడు
ఆత్మవిశ్వాసముండాలంటాడు
సాహసించి ముందుకెడితే
సాధించలేనిదేమంటాడు
ఇవన్ని డబ్బున్నవాళ్ళ మాటలండీఅంటే—
లేదునాయనా
నేనూ కష్టపడ్డాను
యీ మిఠాయి
యీ చేతులతోచేసి
యీ తలమీద పెట్టుకొని అమ్మానంటాడు

సిగరెట్టు త్రాగడు
ఎవరైనా త్రాగితే మందలిస్తాడు
మత్స్యమాంసాందులు ముట్టడు
తిని త్రాగేవాళ్ళను కలిసినపుడు
అవి మన శరీరాలకు అంత
మంచివికావుబాబూ అంటాడు
ఇంగ్లీషు మాట్లాడే ఆంధ్రులనుచూస్తే
ఉర్దూ మాట్లాడే తెలుగువారినికలిస్తే
ఏమయ్యా నీకు తెలుగుభాష రాదా ?
లేక నీవు తెలుగువాడివికావా అంటాడు

అనాధులకు
ఆస్పత్రులకు
హరిజన కాలనీలకు
విద్యా సంస్థలకు
ఎంతో కొంత సహాయం చేస్తున్నాడు
ఏమండి మీరు జాలీనోట్లు
అచ్చుకొట్టి డబ్బు సంపాదించారట అంటే
అదీ ఒక బ్రతుకేనా అంటాడు
మిఠాయి తయారుచేసే సాంచాలతో
అచ్చుగుద్ది ఎంతో రుచికరమైన
మిఠాయిలు తయారుచేస్తుంటాను
అవే అడిగినంతడబ్బు ఇస్తున్నవి

మీరుకూడ మీ పనులు
అచ్చుగుద్దినటుల
శ్రద్ధాభక్తులతో చేస్తే
అవసరమైనంత డబ్బువస్తుంది
అనుకున్నంత మంచిపేరూవస్తుంది
అని నొక్కి వక్కాణిస్తాడు

మనపుల్లన్నకు అప్పుడప్పుడు
బ్రహ్మాండమైన ఆగ్రహంవస్తుంది
మండిపడతాడు
బండమాటలంటాడు కాని
మరు నిముషమే తేనెలాంటి
తీయతీయని మాటలుచెప్తాడు

పుల్లన్నా ! నీకున్న సద్గుణాలకు
నీ ఆగ్రహం కొంచెం తగ్గించుకుంటే
నీ అంత మంచిమనిషి లేడయ్యా

రాష్ట్రంలో నీ మిఠాయి
రాష్ట్ర మారుమూలల్లో నీ మిఠాయి
మద్రాసులో నీ మిఠాయి
ఢిల్లీలో నీ మిఠాయి
ముఖ్యమంత్రికి నీ మిఠాయి
రాష్ట్రపతికి నీ మిఠాయి
ఎక్కడచూసినా పుల్లారెడ్డిమిఠాయి

పుల్లారెడ్డి పేరులోని పులుపు
మిఠాయిలోని-తీపి
యీ రెంటికి సఖ్యత
ఎలో కుదిరిందో
అలా —
దేశంలోని
ధనవంతులకు-బీదవాళ్ళకు
సఖ్యత చేకూర్చి
అందరూ సుఖంగా బ్రతికే
మార్గం ఆలోచించవయ్యా

ఓ భగవంతుడా
రాముడు అని పేరుగలిగినవాడు
రాక్షసుడిలా మారకుండా
శీల అని పేరుపెట్టుకున్న తల్లి
అశ్లీలం మాట్లాడకుండా
పుల్లన్న అని పేరున్నా
తీపన్నగా మారగలిగే
పుల్లన్నలను
స్వీటు పుల్లన్నలను
ఊరూరికి సృష్టించవయ్యా.

---

ఆప్తమిత్రులు, సహృదయులు పరోపకారపరాయణులైన
శ్రీ మిఠాయి పుల్లారెడ్డిగారికి కృతజ్ఞతలతో

# నీ జన్మ సార్థకం చేసుకో

ఓ మనిషీ-
మనిషిగా బ్రతుకడం నేర్చుకో
మనిషంటే మంచి
మనిషంటే మమత
మనిషంటే మానవత

నీలో మంచిని పెంచుకో
మమతలు నింపుకో
ధనదాహం చంపుకో
పదవీవ్యామోహం వదలుకో
మట్టిలోపుట్టి మట్టిలో
కలిసే ఓ మనిషీ
మనిషి విలువెంతో తెలుసుకో

ఎన్నో వేషాలు వేసి
ఎన్నో అడ్డత్రోవలు త్రొక్కి
నానాగడ్డికరిచి
ఆస్తులు-ఐశ్వర్యం
సంపాదించి పిల్లలకిస్తే
వాళ్ళకాడబ్బు విలువతెలియక
తిని-త్రాగి
విచ్చలవిడిగా తిరిగి
ఇల్లు - ఒళ్ళు
గుల్ల చేసుకొని

అంతా గల్లంతైపోయిన
వారెందరు లేరూ ?

పిల్లి - ఎలుకను
పులి - జింకను
వేటాడినటుల
మానవుడుకూడా
తనపొట్ట నింపుకొనుటకు
తన ఇష్టమొచ్చిన జంతువులను
వేటాడుతూనే వున్నాడు
గొర్రెను తినేవాడు గొర్రెను
బర్రెనుతినేవాడు బర్రెను
తింటూనే వున్నాడు
అయినా అది చాలదని
మానవవేటకూడా సాగిస్తూనేవున్నాడు

రాజ్యాలకొరకు
రమణీయమైన
రాణివాసములకొరకు
ధనాగారముల కొరకు
మారణహోమం జరిపారు అనాడు

మరి యీ నాడో
అధికారం పేరట

ఇజాల పేరట
బార్డర్ల పేరట - కాల్వల పేరట
మతాల పేరట - మసీదుల పేరట
నీటిపై పెత్తనం కొరకు
ఆకాశంపై ఆధిపత్యం కొరకు
ఏదో ఒకదాని పేరట
యుద్ధాలు జరుగుతునే యున్నవి
రక్తపాతం జరుగుతూనే వున్నది

నేటి సమాజంలో
బలమైనవాళ్ళు
అధికారంలో వున్నవాళ్ళు
తెలివి వున్నదనే
అహంభావం కలవాళ్ళు
దీనులను - అనాథలను
ఆర్థికఇబ్బందులకు గురిఅయినవారిని
నిందించి, ఏడ్పించి
హింసించి, చిత్రవధ జేసి
మసిచేసి - మాయచేసి
అనుభవిస్తున్నారు
ఆనందిస్తున్నారు

సోదరా—
కాకులనుకొట్టి గ్రద్దలకేసే
యీ బుద్ధి పోగొట్టుకోరా

మానవుడై పుట్టి
రాక్షసుడిగా మారితే ఎలా?
భగవంతుడు ఎన్నిజన్మల తర్వాత
నీకి మానవజన్మ నిచ్చాడో
ఈ అవకాశం వదులుకోకు
మానవత్వం కోలుపోకు
మంచిపనులుచేసి
మనిషిగా బ్రతుకు
యీ జన్మపోతే
మళ్ళీ జన్మలో
కుక్కవై పుడ్తావో
నక్కవై పుడ్తావో లేక
గాడిదగా జన్మిస్తావో
ఆనాడు ఆపేరు ఎలాగో
సార్ధకం చేసుకోవచ్చు కాని
ఈనాడు యీ జన్మ సార్ధకం చేసుకో.

# ప్రకృతి వైద్యం

భూమ్యాకాశ తేజో వాయుజల
మనబడు పంచ భూతములచే
నిర్మించబడిన మానవ శరీరానికి
పంచ భూతములతో వైద్యం చేయడం
ప్రకృతి వైద్య సిద్ధాంతం

మనం తినేఆహార పదార్థాలు
జీర్ణమై, రక్త మాంసాలుగామారి
అన్య పదార్థ బహిష్కరణ
క్రమబద్ధంగా జరిగినపుడే
ఆరోగ్యం - ఆనందం
అలా అన్యపదార్థ బహిష్కరణ
సహజ ధోరణిలో జరుగనపుడు
శరీరంలోని ప్రకృతి సిద్ధమైన చైతన్యశక్తి
ఆ అన్య పదార్థాన్ని
బహిష్కరించ నారంభించు
అదియే వ్యాధి కారంభం

కడుపుబ్బ లడ్డూలుతిని
కడుపు నొప్పితో బాధపడుతూ
డాక్టరు దగ్గరి కెళ్ళాడట
ఒక భోజన ప్రియుడు
డాక్టరొక మందుగోలివ్వబోగా
"గోలీపట్టే ఖాళీవుంటే

ఇంకొక లడ్డు తినేవాణ్ణి
గోలివద్దు - సూదివ్వండి స్వామీ"
అన్నాడట ఆ పురుష పుంగవుడు
ఇలా క్రమంతప్పి తినేసి
అయినది కానిది మింగేసి
జీర్ణావయవాలకు
సరియైన విరామం లభించక
మలమూత్ర విసర్జన చక్కగా జరుగక
ఆకలి మాంద్యం - బడలిక
నిద్రలేమి — జలుబు లాంటి
సామాన్య రోగ లక్షణములు
కన్పించినపుడు
జీర్ణ యంత్రానికి
కొంచెం విశ్రాంతి నివ్వాలనే
విషయం అర్థం చేసుకోలేక
ఏవేవో మందులు తింటున్నాడు
తిండిమీద ప్రీతి
ప్రాణంమీద తీపి కలిగిన
నవనాగరిక మానవుడు

ఒకప్పుడు
అన్యపదార్థ బహిష్కరణ
జ్వరరూపంలో జరుగుతూంటే
శరీరమంతా నొప్పులతో బాధపడుతూంటే

నాలుక మీద రుచి లేక
మంచినీళ్ళు కూడా సహించని సమయంలో
తినలేను బాబో అని రోగి
గోల పెడుతూంటే
బలహీనత వస్తుందనే నెపంతో
మళ్ళీ తోస్తుంటారు కడుపులోకి
ఏవో తినుబండారాలు
ఏకాదశి అని
ఒకప్రొద్దులని
ఉపవాసాలు చేయాల్సిన రోజులలో
నెయ్యితో, ఇతర మసాలాలతో
పిండివంటలు తయారుచేసి
కడుపు పగిలేటట్లు తింటున్నారు
కమ్మగా వున్నవని
సాయంత్రం కాగానే
అల్పాహారాలెన్ని తిన్నా
అన్నమెలా అవుతుందని
విందుభోజనం వడ్డిస్తారు శ్రీమతిగారు
సంతోషంగా భోంచేస్తారు శ్రీవారు

ఈవిధంగా ఆహార విషయంలో
అశ్రద్ధచేసి — అనారోగ్యులై
డాక్టర్ల చుట్టూ తిరుగుతూంటే
రోగి శరీరంలో వున్న

వ్యాధి క్రిములను సంహరించి
వ్యాధి నిర్మూలన జరపాలని
ప్రయోగిస్తున్నారు మన డాక్టర్లు
విషపూరితమైన సరికొత్త మందులు
ఈ విషపు మాత్రలు
ఆ క్రిమి సంహారణతో సహా
శరీరంలోని అవయవాలకు
హాని చేస్తున్నవి
జీవశక్తిని క్రమేణా
బలహీనం చేస్తున్నవి

అలా వ్యాధి సమూలంగా తగ్గిపోకుండా
తాత్కాలికంగా అణచబడుతుంది
ఆ మందుల వాడకం తగ్గినపుడో
లేదా శరీరంలోని చైతన్య శక్తి
పుంజుకున్నపుడో
ఆవ్యాధి తీవ్రరూపం దాలుస్తుంది
లేదా వేరే జబ్బుగా మారుతుంది
అందుకే మధుమేహం బదులు
రక్తపుపోటు వస్తుంది
దాన్ని విషపూరితమైన మందులతో అణచివేస్తే
గుండెపోటు వస్తుంది
దాన్ని అణచి వేయడానికి ప్రయత్నిస్తే
ఆ గుండే ఆగిపోతుంది

ఇవన్నీ బాగా తెలిసిన
గాంధీ - వినోబా లాంటి పెద్దలు
ప్రకృతి వైద్యం - విశిష్టమైన వైద్యం అన్నారు
ప్రాకృతిక జీవనం అలవర్చుకొన్నారు

ఈ వైద్య విధానంలో
మందులతో పనిలేకుండా
ఉపవాసం ద్వారా
ఎనిమా ద్వారా
మట్టి పట్టీల ద్వారా
సూర్యకిరణ ప్రసరణ లాంటి
తదితర ప్రక్రియల ద్వారా
శరీరంలో నిలచిపోయిన
అన్య పదార్ధ నిర్మూలనచేసి
మానవయంత్రాలను "ఓవర్ హాల్"చేసి
పళ్లు - పచ్చి కూరగాయలు
ఉప్పు కారంలేని సాత్వికాహారం
రోగికిచ్చినపుడు
అదిచక్కగా జీర్ణమై
శరీరమునకు కావలసిన
శక్తి సత్తువల నిచ్చును
అందుకే ఎలాంటి జబ్బులైనా తగ్గి
అద్భుతమైన ఫలితములు కల్గుచున్నవి

కొంతమందికి పోయిన కన్నులు వచ్చినవి
నిర్వీర్యు లెందరో వీర్యులైనారు
సంతానం లేనివారు కొందరు
మాతృమూర్తులైనారు
మందుల వలన నయంకాని
మొండి వ్యాధులెన్నో మాయమైనవి

జీవించి ఇక లాభం లేదని
నిరుత్సాహపడిన వారెందరో
ప్రాకృతిక జీవనం అలవర్చుకొని
ఆరోగ్యవంతులై
హాయిగా జీవిస్తున్నారు

---

నిర్విరామంగా రాత్రింబవళ్ళు శ్రమించి ప్రకృతి చికిత్స ద్వారా రోగులకు సేవ చేస్తున్న డా॥ బి. వెంకట్రావు డా॥ [illegible] శాస్త్రి మరియు శ్రీ చౌదరి [illegible] కృతజ్ఞతలతో.

# వరకట్నాలు

"వరకట్నాలు నిషేధించ బడాలనీ
వరకట్నం ఇచ్చిన వాళ్ళను
వరకట్నం తీసుకున్న వాళ్ళను
వధూవరులతో సహా
జైయిలుకు పంపించాలి''
అన్నవాళ్లేకొందరు
లక్షలకు లక్ష లిస్తున్నారు
వేలకు వేలు ఖర్చు పెట్టున్నారు

యీమధ్య కొందరాడ పిల్లలు
వరకట్నాలు వనితల నాశనానికి
కారణం అన్నారు
ఉపన్యాసా లిచ్చారు
ఊరేగింపులు జరిపారు

నిజమే—
వరకట్నాల పాపకూపంలో
ఎందరో బలిఅయినారు
కానీ—
అసలు వరకట్నం
ఎవరు కావాలంటున్నారు ?
వరుడా ?
వరుడి తలిదండ్రా ?
వరుడి అక్క చెల్లెండ్రా ?

ఇది తల్లితో మొదలయ్యి
తండ్రితో బలపడి
సోదరీమణుల సారధ్యంలో నడిచి
వరుడి మీదుగా వెళ్ళిపోతుంది

వరకట్నాల విశేషాలేమంటే
కూతురుకు కట్న మివ్వకూడదన్న తండ్రి
కుమారుడికి లక్షలు కావాలంటున్నాడు
తన చెల్లెలుకు కట్న మియ్యవద్దన్న అక్కయ్య
తన సోదరుడికి కట్నమే కాదు
వాడికో కారు కావాలి
దానికో రేడియో వుండాలంటుంది
కట్నం తీసుకోమని బల్లగుద్దిన ఒకసోదరి
పెళ్లి చేసుకొని ఇద్దరు బిడ్డలకన్న తర్వాత
తనభర్త కేమివ్వలేదు కాబట్టి
వడ్డీతోసహా ఇప్పుడివ్వాలని
తల్లి తండ్రుల ప్రాణం తీస్తుంది
మాఅబ్బాయి అమెరికా వెళతాడట
ఆ ఖర్చు మీరే భరించాలంటుంది
పెళ్లికొడుకు తల్లిగారు
"ఫారిస్ రిటర్న్" అల్లుడొస్తున్నాడు
ఫర్వాలేదనండి — అని పోరుపెడుతుంది
పెళ్లికూతురు తల్లిగారు

ఇలా ఇవన్నీ మనమే సృష్టించుకొని
మనమే అనుభవిస్తున్న బాధలు
నిజంగా ఆలోచిస్తే -
కట్నాలు కానుకలు
ఏదో ఒక రూపంగా
ఇచ్చేవాళ్లు ఇస్తూనే వున్నారు
తీసుకునేవాళ్ళు తీసుకుంటూనే వున్నారు
డబ్బు రూపంలో కాకపోతే
నగల రూపంలో లేదా
ఆస్తి రూపంలో
అందినదంతా అందుకుంటూనే వున్నారు
ఇవన్నీ ఎందుకండీ ?
తండ్రి ఆస్తిపైన
ఆడమగ భేదం లేకుండా
అందరిపిల్లలకు
సమానహక్కులుండేటట్లు
ఒక్క శాసనం చాలదా
యీ సమస్యా పరిష్కారానికి?
ఇంతకీ——
మన సమస్య కట్నాలదేనా ?
పెళ్లి సమయాలలో వచ్చిన
మన పెళ్లి పెద్దల పెంకితనాలు
తల్లి తండ్రుల విచిత్ర మనస్తత్వాలు
గోటితో పోయే వాటిని కొండంతలుగా

చేసుకొని బాధపడే మన
తలతిక్క వేషాలు

మన దేశంలో
ఆడదాని సమస్యలు
యీ కట్నాలతో తీరిపోయేవా ?
ఎన్ని లక్ష లిచ్చినా
ఎంత ఆస్తి పంచి ఇచ్చినా
వచ్చే వరుడు మంచివాడు కాకపోతే,
ఆడదాని జీవితం
అధ్వాన్నం కాదా ?

అలాగే ఎవడైనా
ప్రేమించి, మనసిచ్చి
మంచి ఆశయాలతో
పెళ్లి చేసుకున్న ఆతల్లి
గయ్యాళిగా మారితే
కట్టుకున్నవాడి కష్టాలు
పరాకాష్ట నందుకోవా ?

# నాయకులపై విమర్శలు

ప్రధాన మంత్రికి విమాన మెందుకు?
ముఖ్యమంత్రి కింత పెద్దకారెందుకు?
అంతపెద్ద ఇల్లెందుకు?
ఇంటినిండా కుర్చీ లెందుకు?
వీరికింత జీతాలెందుకు?
ఇంతమంది పనివాళ్లెందుకు?
అని కొందరు పెద్దలు విమర్శించారు
ఎందరో విమర్శిస్తూనే వున్నారు

ఇలాగే విమర్శించిన
కొందరు మిత్రులు
ఓ మంత్రిగారింటికెళ్ళి వచ్చాం
కూర్చోడానికి కుర్చీలేదు
నిల్చోడానికి స్థలంలేదు అన్నారు

విమర్శనా పంచాంగం వల్లించే
ఓ విమర్శకులారా
మీదృష్టిలో మంత్రులు
ముఖ్యమంత్రు లెలా వుండాలి?
వారు సర్వం త్యాగంచేసి
ప్రజాసేవ జేయడానికి సిద్ధంకావాలి
వారికి జీతాలు తక్కువగా వుండాలి
వారికి పెద్ద బిల్డింగులువద్దు
పెద్దకార్లువద్దు

కానీ—
గంటల తరబడి
వచ్చే ప్రజలతో, ప్రజా ప్రతినిధులతో
అలసి పోకుండా మాట్లాడాలి
వారి పనులు చేసిపెట్టాలి
ఉద్యోగాలిప్పించాలి
ప్రమోషన్లు ఇప్పించాలి
ఎక్కడైనా "ప్యూన్" పని ఖాళీ వస్తే
మంత్రిగారి సిఫారసు కావాలి

నీవొక చెప్పుల దుకాణం తెరిస్తే
దాని ఇనాగ్యురేషన్‌కు రావాలి
నీ తమ్ముడి బట్టల దుకాణం కాలిపోతే
దాని సంతాప సభకు రావాలి
అంతేకాదు మీ సతీమణిగారు
మహిళా మండలి ప్రారంభిస్తే
దాని రిబ్బను కటింగులకు రావాలి
ఇలాంటివి రోజూ
ఎన్నో చేస్తూనే వుండాలి
మరి వీటన్నిటికి ఎలా రావాలి?
మంత్రిగారు కారులో వెడితే
ఖర్చు పెరుగుతుంది కాబట్టి
ఒక రిక్షాలో కూర్చోపెట్టి తీసుకుపోదామా?

ఇనాగ్యురేషన్ చేయించుకొని
మంత్రిగారికో పూలమాలవేసి
రిబ్బాకో నాల్గు పూలుకట్టి
తిరిగి వచ్చేటప్పుడు దారిలో
మన రిక్షాకొక ఆటోరిక్షా గుద్దుకొని
మంత్రిగారు
మహా ప్రమాదానికి గురి అయితే
హాస్పిటలు కెళ్లే దారిలో
ఆతని ప్రాణాలుపోతే
బాగైంది, ఇన్నాళ్ళు వెలిగింది చాలు
అనేవాళ్ళుకూడా అనేకులున్నారు మనదేశంలో
పిచ్చి మొహాల్లారా !
మన భవిష్యత్తు
మనదేశ భవిష్యత్తు
వాళ్ళచేతుల్లో పెట్టి
మన బ్రతుకులను నడిపే
మన రథసారథులకు
మంచిరథాలే లేకపోతే ఎలా?

అయ్యా !
అందరూ మనలాంటి మనుషులే
వారికీ రెండు కాళ్లు రెండు చేతులేకదా వున్నవి

మరి నీవుచేయలేనివన్నీ
వారు చేసిపెట్టాలి
రోజూ వందమందిని చూడాలి
వందఫైళ్ళు చూడాలి
నీవు ఓటువేసి గెలిపించినందుకు
ఎరువులిప్పించాలి
అప్పులిప్పించాలి
ఎక్కడైనా ఒక టెండరువేస్తే
ఆ పని ఇప్పించాలి
పదవతరగతి ప్యాసుకాకపోయినా
నీ సుపుత్రుడికి
ఉద్యోగం యిప్పించాలి
సీనియారిటీవున్నా లేకపోయినా
నీఅల్లుడికి ప్రమోషన్ తెప్పించాలి
లేకపోతే వచ్చేఎలక్షన్‌లో
నీగ్రూపులో వుండం
నీకు ఓట్లువేయం అంటారు
అంతేనా?
మనం ఆశించవలసినది ఇంతేనా?
కాదు కాదు !
వారిలోనీతీ-నిజాయితీ
మంచితనం

మానవసేవ చేయాలనే ఉత్సాహం
తోటిసోదరులకు
సహాయం చేయాలనే దృఢనిశ్చయం
అంతకంటే మించినది
ఒకగంటలో పదిగంటలపనిచేసే
శక్తి సామర్థ్యాలుండాలి
ఎంతటి బరువైనా మోసేఓపికవుండాలి
ఇలాంటి సద్గుణాలున్నవారిని
మనము ఎన్నుకోవాలి
ప్రజాప్రతినిధులుగా చేయాలి

అప్పుడు వారికి కావలిసిన
సౌకర్యాలన్ని సమకూర్చాలి
రోజుకు ఇరువై గంటలుపని
చేసేవసతు లేర్పరచాలి
ప్రజల సమస్యలను ప్రశాంతంగా
పరిష్కారంచేసే పరిస్థితులు కల్పించాలి
ఫైల్సు అన్నిచూసి న్యాయమైన తీర్పులు
ఇచ్చేలా దోహదం చేయాలి.
సోదరా—
శరవేగంగా పరుగెత్తుతున్న
ఈ ప్రపంచ ప్రవాహంలో
మనం తాబేలు పద్ధతిలో
కదిలే రోజులు కావివి

"సమయం" విలువ తెలువ తెలిసికొని
"మనిషి" విలువ తెలిసికొని
వారిలోవున్న శక్తి సామర్థ్యాలను
ఉపయోగించుకోవాలి

మన నాయకులకే కాదు
బరువు బాధ్యత గలగిన
ప్రతి పౌరుడికీ కావలసిన
సౌకర్యాలన్ని సమకూర్చాలి

ఇవన్ని ఇచ్చిన తర్వాత
వారు వారి బాధ్యతలు
చక్కగా నెరవేర్చ లేకపోతే
అనుకున్న రీతిగా ఆశయసిద్ధికి పాటుపడకపోతే
వారి బలహీనతలను గుర్తించి
వారే గద్దినుండి దిగాలి

అది చేయని నాడు
ప్రజలే వారిని గద్దెనుండి దింపాలి.

# నాగురించి

నేనొక సామాన్యమానవుణ్ణి
అందరిలా నాలోకొన్ని
బలహీనతలున్నవి
నేనభివృద్ధికి రావాలని
నాపిల్లలు విద్యావంతులై
పెరిగి పెద్దవారుకావాలనే
స్వార్థచింతన లేకపోలేదు

అయినా నాలోఒక
బలమైన కోరికవున్నది
నాబలహీనతలు నేనుతెలుకొని
నా తప్పులను నేనుదిద్దుకొని
పరిస్థితుల ప్రభావంవలన
ఆపదలోపడిన వారినాదుకోవాలని
నిస్సహాయస్థితిలో నున్నవారికి
చేతనైన సహాయంచేయాలని
నా అంతరాత్మ పీకుతుంది

మానవుడు భూమ్మీద పుట్టింది
ఏవో కొన్ని మంచిపనులు
సాధించడానికేనని
మంచిఆశయాలతో ముందుకెడితే
భగవంతుడనుగ్రహిస్తాడని
నాదృఢవిశ్వాసం

ఆ విశ్వాసంతోనే
వాస్తుశిల్పినయ్యాను
వాస్తుశాస్త్ర పరిశోధనార్థం
ఒక గృహనిర్మాణంచేశాను

కొందరు మిత్రులు
ఇంత పెద్దఇల్లెందుకన్నారు
ఇన్‌కంటాక్సువాళ్ళు
వెంబడిపడ్తారన్నారు
అదీ అయిందన్నాను
ప్రభుత్వం తీసుకుంటుందన్నారు
మనప్రభుత్వం మంచిసంకల్పంతో
అలాచేస్తే నాయిల్లు
ఒకసంస్థకు ఆలవాలం కాగలదన్నాను
అంతకంటే ఆనందమేమి కావాలన్నాను

మనజీవితాలే శాశ్వతంకానపుడు
మనప్రాణమేనిమిష మెగిరిపోతుందో తెలియనపుడు
వీటిగురించి ఇంత విచారమెందుకు?

చిన్ననాడు నా తల్లి నన్ను భుజానవేసుకొని
వైద్యులచుట్టూ
గుళ్ళగోపురాలచుట్టూ
తిరిగి నన్ను బ్రతికించుకొంది

ఆ తర్వాత నైజాం కాలంలో
రజాకార్లు నన్ను బంధించారు
ఆచావుకూడా తప్పిపోయింది

ఇప్పటికే రెండుసార్లు వచ్చిపోయిన యీచావు
ఏ నిమిషమైనా రావచ్చు
అందుకే యీచావురాక ముందే
అనుకొన్న కొన్ని మంచిపనులు
చేయాలనివుంది

రాత్రింబవళ్ళు కష్టపడి
కొంతసంపాదించాలనివుంది
ఆ సంపాదించినదానిలో కొంత
సమాజంలో వెనుకబడినవారికి
సహాయంచేసి-సద్వినియోగపరచాలనివుంది

బ్రతికినంతకాలం
బాగున్నవారినిచూసి
అసూయపడకుండా
అందని సౌధాలకొరకు
అర్రులు చాచకుండా

అందేసౌధాలన్నీ అందుకొని
ఎక్కగలిగిన మెట్లన్నీ ఎక్కి
మెట్లక్రిందవున్నవారిని మరిచిపోకుండా

వారిని పైకిలాగడానికి
శాయశక్తులా ప్రయతించాలనీ
ఆఖరి రోజులలో
ఆధ్యాత్మికచింతన అలవర్చుకొని
మానసికానందం పొందాలనీ
వీటన్నిటికి తగిన శక్తిసామర్థ్యాలిచ్చి
భగవంతుడు నన్నాశీర్వదిస్తాడనివుంది
ఆతర్వాత సంతృప్తిగా
కన్నుమూయాలని వుంది.

ప్రియమైన నా జననీజనకులకు ప్రేమతో.

# చదువుకున్నవాళ్ల బాధ్యతలు

ఏమిటీ విద్యావిధానం?
ఏమిటీ నిరుద్యోగసమస్య?
వీడెంతలంచగొండి?
వాడేమి తప్పుచేశాడని జైల్లోవేశారు?
ముఖస్తుతిచేసేవారికేమో
అన్నిలభిస్తున్నవి
ముక్కుసూటిగాపోయేవాడికేమో
ముప్పతిప్పలు పెడుతున్నారు
ఇదేమి ప్రజాస్వామ్యం?
ఈ అన్యాయాన్ని అక్రమాన్ని
ఎదిరించే మొనగాడేలేడా మనదేశంలో?

ఉన్నారు-ఎందుకు లేరు?
గదులలో కూర్చొని
తలుపులు మూసుకొని
సీసాలు తెరుచుకొని
సోడాబుడ్ల బుసబుసల్తో
బుసలుకొట్టే మనం
క్లబ్బులలో కూర్చుని
అస్తమానం అక్కరకు రాని కబుర్లతో
ప్రపంచంలోజరిగే ప్రతిదాన్ని
విమర్శించే మనమంతా
మొనగాళ్ళంకామా?

సోదరులారా!
మిమ్ముమీరు ప్రశ్నించుకోండి
మీఅంతరాత్మలలోకి తొంగిచూడండి
చదువుకున్నవాళ్ళం
ఎంతోకొంత సంస్కారం అబ్బినవాళ్ళం
తినడానికి తిండి
వుండడానికి ఇల్లువున్నవాళ్ళం
మంచీచెడూ ఆలోచించగల శక్తివున్నవాళ్ళం
మనం మనభవిష్యత్తుగురించి
మనదేశ భవిష్యత్తుగురించి
ప్రజల స్థితిగతులగురించి
ఎప్పుడైనా ప్రశాంతంగా ఆలోచించామా?
ఒక్కనిర్మాణాత్మకమైన విమర్శచేశామా?
ఒక్కనిర్మాణాత్మకమైన పని చేశామా?

ఏదో ఒకమంచిపని చేశామని
గుండెమీద చేయివేసుకొని చెప్పగలమా?
ఇవేమీ చేయకుండా
విమర్శలతో కాలక్షేపం బఠాణీలలాగ
రాత్రింబవళ్లు వల్లెవేసుకుంటే ఎలా?

స్నేహితులారా!
మీరుచేసేవిమర్శలలో కొంత నిజముండవచ్చు

కాని — మీవిమర్శ ఎవరిమీద?
ప్రభుత్వంమీద — ప్రజాప్రతినిధులమీద

వారెవరు వారిని ఎన్నుకొన్నదెవరు?
వారూవీరూ అందరూ
మనసోదరులేకదా!
మరి వీటన్నిటికి మనబాధ్యతలేదా?
మీవుద్యోగం
మీవ్యాపారంతప్ప
రాష్ట్ర సమస్యలతో
దేశసమస్యలతో
మీకు సంబంధంలేదా?

మీరంతాకలసి
శక్తిసామర్థ్యాలు కలవాణ్ణి
ఎవరినైనా ఎలక్షనులో నిలబెట్టారా?
వారికిఓట్లు వేశారా?
వారిని గెలిపించారా?
వారికవసరమైన సహాయంచేశారా?
వీటితో ప్రమేయమేమిలేనట్లు
ఓట్లసమయంలో
నీకునచ్చిన అభ్యర్థి లేడని
ఆతనికేమీ సద్గుణాలులేవని

క్యూలో నిల్చునే ఓపిక లేక
పెళ్ళాం పిల్లలను తీసుకొని
సినిమాలో కూర్చుంటే ఎలా?

ఇవేనా విద్యాబుద్ధులుగలిగిన
పెద్దమనుషుల బాధ్యతలు?
సమాజానికి సంఘానికి
మనం ఋణపడిలేమా?

దేశంలో అరాజకత్వంచెలరేగినపుడు
అమాయకులు హింసించబడుతున్నపుడు
బలహీను లెందరో
బాధలకు గురియగుతున్నపుడు
ప్రజాప్రతినిధులు వారిపనులు
చక్కగా నిర్వర్తించనపుడు
మనలోమనం గుసగుసలుమాని
ప్రభుత్వానికి తెలిసేటట్లు
ప్రజల కర్థమయ్యేటట్లు
వారివారితప్పులు దిద్దుకునేలాచేయాలి
నవసమాజ నిర్మాణానికి తోడ్పడాలి.

# స్త్రీ స్వాతంత్ర్యం

స్త్రీకి స్వాతంత్ర్యం లేదని
అడుగడుగున అణగత్రొక్కబడుతుందని
మగవాడికి బానిసగా
బ్రతకవలసి వస్తుందని
స్త్రీలు కొందరిమధ్య
చాలా మథనపడుతున్నారు
బహిరంగంగా చెప్పుకుంటున్నారు
బాహాటంగా వాదిస్తున్నారు

మగవారికి సమానంగా
జీతాలు లేవని
మంత్రివర్గాలలో సరియైన
ప్రాతినిధ్యం లేదని
ఇష్టమైన సినిమాలకు
వెళ్ళనీయలేదని
క్లబ్బుకెళ్ళడానికి కారివ్వలేదని
ఎంతో మూగబాధ ననుభవిస్తున్నారు
కొందరు ఇంట్లో పోరుపెడ్తున్నారు

పైనచెప్పినవాటిలో కొంతనిజం లేకపోలేదు
మానవజన్మఎత్తిన మనకు
స్త్రీ పురుష భేదంలేకుండా
కావలసిన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలుండాలి

కానీవాటికీ హద్దులుండాలి
స్త్రీలకేకాదు పురుషులకూ్కడా వుండాలి
నిజంగా ఆలోచిస్తే –
స్త్రీకి స్వాతంత్ర్యం
ఎక్కడ లోపించిందో
అర్థంకావడంలేదు

స్కూళ్లలో-కాలేజీలలో
ఉద్యోగాలలో అంతటావున్నారు
సినిమాలు–డ్యాన్సులు
నాటికలు-నాట్యాలు
అన్నిట్లో పైచేయిమీదే
కథలు అచ్చుపడాలంటే
ఆడవారైనా వ్రాయాలి
ఆడపేరైనా వ్రాసుకోవాలి
టైపిస్టుగా-స్టెనోలుగా
స్త్రీలకే ప్రత్యేకత

లేడీస్ బ్యాంకులు
లేడీస్ క్లబ్బులు
లేడీస్ సూపర్ బజారులు
ఎక్కడచూసినా లేడీస్ఫస్టు
రచయితలుగా పైకివస్తున్నారు
కవులుగా పైకివస్తున్నారు

అధ్యాపకులుగా చలాకీగా
పనిచేస్తూనే వున్నారు
ఇంజనీర్లుగా ఆర్కిటెక్టులుగా
ముందంజ వేస్తునేవున్నారు
సైకిళ్ళు నడుపుతున్నారు
మోటారుసైకిళ్ళు నడుపుతున్నారు
జీపులు-కార్లు అన్నీ నడుపుతూనే వున్నారు
జుట్లు కత్తిరించుకుంటున్నారు
మగవాళ్ల దుస్తులేసుకుంటున్నారు
చీరెలకు పంగనామాలుపెట్టి
పాంట్లు వేసుకొంటున్నారు
ఇంకా ఏమిచేస్తారండి ?

మగవాడు సిగరెట్టు త్రాగుతున్నాడు
మద్యపానం చేస్తున్నాడు
క్లబ్బుల్లో తిరిగి
లేటుగా ఇంటికొస్తున్నాడు
అవీ మీరు చేయదలుచుకున్నారా ?
ఇవీ కొంతమంది చేస్తూనేవున్నారండీ
అదృష్టంకొద్దీ వారు
మైనారిటీలో వున్నారు మనదేశంలో
యీ స్వాతంత్ర్యాలన్నీ
ఆడవారికి అధికంగా వున్న
దేశాలను చూడండి

మానసికానందం లేక
మసిలైపోతున్నారు
అయినా—
మగవాడి బడాయంతా
ఆడదానిపైన
ఒక పిల్ల పుట్టేవరకేనండి
ఆ తర్వాత గీచిన గీత
దాటడం లేదనికదా కొందరికి
'హెన్‌పెక్డ్' భర్తలనే
పేరు వస్తున్నది
కొంతమంది ఆ పేరు సార్ధకం
చేసుకోవడానికి ప్రయత్నిస్తుంటే
కొందరేమో Inferiority Complex తో
సతమత మవుతున్నారు

మనసు విప్పి మాట్లాడాలంటే
కొన్ని సంసారాలలో మగవాడు
కొన్ని సంసారాలలో ఆడది
పెత్తనం చలాయిస్తూనే వున్నారు
ప్రత్యేకమైన పరిస్థితులలో
ఒకచోట ఆడది
ఒక చోట మగవాడు
మానసికమైన బాధలకు
గురి అవుతూనే వున్నారు

అందుకే సోదరీమణులారా
ఎవరికెంత స్వాతంత్ర్యం
అవసరమో నిర్ణయించుకొని
చెడుదారిన వెళ్ళే మగవాణ్ణి
నయాన — భయాన
మంచి దారిన పెట్టండి
అతని స్వాతంత్ర్యాన్ని అరికట్టండి
అనురాగాలను పెంచుకోండి
సంసారాలను బాగుచేసుకోండి
కానీ— —
మీరా స్వాతంత్ర్యం కోరుకోకండి

అమ్మాయిలూ —
మీ స్వాతంత్ర్యం అరికట్టడానికి
మగవారే బాధ్యులు కారమ్మా
మీ అక్కలు - మీ అత్తలు
మీ అమ్మలు - మీ అమ్మమ్మలు
కొంతవరకు బాధ్యులేమో!
పనిపాటలు లేక
ఊసుపోక
నోరు పారేసుకొని
మగవాళ్ళకు నేర్పి

పోరు పెట్టి
కోటి స్త్రీని చులకనగా చూసి
వారు ఇబ్బందులుపడ్తున్నారు
అందరినీ ఇబ్బందుల పాలుచేస్తున్నారు
వారినాలుకలు అదుపులోవుంటే
వారిచేతలు హద్దుల్లోవుంటే
మీస్వాతంత్ర్యానికి ముప్పులేదు
మా ఆనందాలకు అవధిలేదు

ఈదేశంలో స్త్రీకి
మగవాడెప్పుడూ ఉన్నతస్థానమేఇచ్చాడు
సోదరిగా ప్రేమిస్తున్నాడు
మాతృమూర్తిగా పూజిస్తున్నాడు
భార్యగా చేసుకొని
వలపుల ఒయ్యారిగా వూహించుకొని
తీయతీయనికలలుకంటూ
ఆరాధ్యదేవతగా
ఆరాధిస్తూనే వున్నాడు

అందుకే—
మీ అనుమానాలు మానుకొని
మనసులు పాడుచేసుకోక

వున్నస్వాతంత్ర్యాన్ని
సద్వినియోగం చేసుకోని
మగవాడికున్న స్వాతంత్ర్యాన్ని
కొంతవరకు అరికట్టి
దారితప్పివెళ్లేవాళ్లను
సరియైన మార్గంలోకితిప్పుకొని
మీ జీవితాలు స్వర్గమయం చేసుకోండి
ఆస్వర్గంలో
మాకు కాస్త చోటివ్వండి

# విద్యార్థి సోదరులు

ఉస్మానియా యూనివర్సిటీలో
ఉత్తీర్ణులైన విద్యార్థులు యీ
ఉద్యోగాలకు అప్లయి చేయరాదని
పత్రికల్లో ప్రకటనలు చూసినప్పుడు
ఉస్మానియాలో చదువుకున్న వారి బాధ
వారి తల్లి తండ్రుల తపన
అధ్యాపకుల ఆవేదన
ఆకాశాన్నంటుకున్నది ఆ రోజులలో
అంటే అతిశయోక్తి కాదేమో—

అయ్యో మన విద్యార్థులు
అంత అధ్వాన్నం అయిపోయారా ?
వీళ్ల చదువులు గంగపాలై పోయినవా ?
వీళ్ల పట్టాలకు విలువ లేకుండా పోయిందా ?
నా యూనివర్సిటీలో చదువుకున్న
నా విద్యార్థి సోదరులను

వీరు చదువు సంధ్యలు నేర్చుకోలేదు
కాపీలు కొట్టి పరీక్షలు ప్యాసు అయినారు
వీళ్లకు కావలసిన జ్ఞానమింకా రాలేదు

వీళ్ళు అల్లరి మూకలు
వీళ్ళకు క్రమశిక్షణ లేదు
వీళ్ళు మా ఉద్యోగాలకు పనికిరారు
అని ఒక ముద్రవేసి
దేశంలోని వారందరూ

చిన్నచూపు చూస్తుంటే
అప్పుడప్పుడు ఎంత మూగబాధ
అనుభవించామో
కానీ—
ఇప్పుడు ఎంతో ఆనందంగా వుంది

వెంగళరావుగారి నిర్ణయమో లేక
వెంకటేశ్వరుడి సంకల్పమో కాని
మన విద్యార్థి సోదరుల అదృష్టం బాగుంది
వారి తలిదండ్రుల మానసికావేదన
పోయే రోజులొచ్చినవి
శ్రీ జగన్మోహన్ రెడ్డిగార్ని
వైస్‌ఛాన్సలర్‌గా రమ్మని
కోరడం జరిగింది

నేను ఇన్ని సంవత్సరాలుగా
ఉద్యోగం చేస్తున్నాను
ఎంతో బరువు బాధ్యతలు మోసాను
ఇంకా నాకు ఇంకొక పదవెందుకు ?
భగవంతుడు నాకిచ్చిన
యీ పెన్షన్ చాలు
ఇంకెవరికైనా అవకాశమిస్తే
బాగుండదా ?
అన్నారు శ్రీ రెడ్డిగారు

కానీ మన ముఖ్యమంత్రిగారు
రెడ్డిగారిని వదలలేదు
మీరు వైస్ ఛాన్సలరు కావాల్సిందే
యీ యూనివర్సిటీకి వచ్చిన
చెడ్డపేరు పోవాల్సిందే
అని పట్టు పట్టారు

అలాంటి పరిస్థితులలో
వైస్ ఛాన్సలర్ పదవిని చేపట్టిన రెడ్డిగారు
నెలకు ఒక రూపాయి జీతమే తీసుకొని
తన ఇంట్లో వుంటూ
తన తిండి తింటూ
విద్యార్థులలో క్రమశిక్షణ
విద్యావిధానంలో కొన్ని మార్పులు
పరీక్షలు వ్రాసేటప్పుడు కొన్ని కఠిన చర్యలు
అన్నీ అమలు పర్చారు

ఆరంభంలో అన్నీ ఆటంకాలే
విద్యార్థిసోదరులకు కోపమొచ్చింది
పరీక్షలు వ్రాయమన్నారు
సమ్మెలు చేస్తామన్నారు
నీ కాళ్ళు విరగ్గొడతాం
నీ ప్రాణం తీస్తామని
వందలాది వుత్తరాలు వ్రాశారు

కానీ రెడ్డిగారు భయపడలేదు
కండబలం - గుండెబలమున్న మగాడు
అధికారం చలాయించినవాడు
ఎందరో ఖూనీకోరులను చూసినవాడు
ఎందరినో ఉరికంబ మెక్కించినవాడు
ఎందరో అమాయకులను
ఉరిశిక్షనుండి కాపాడినవాడు
ఎన్నో సంవత్సరాలనుండి
వందలాది విద్యార్థులకు స్కాలర్ షిపులిచ్చినవాడు
(అందులో నేనూ ఒకణ్ణి)
విద్యార్థుల ఉత్తరాలు చూసి
తొణకలేదు-బెణకలేదు
ఏది ఏమైనా యీ మంచి పని
సాధించాల్సిందే అని
ఒక నిశ్చయం తీసుకొని
నిద్రాహారాలుమాని
రాత్రింబవళ్ళు కష్టపడి
విద్యార్థులతో కలిసి
అధ్యాపకులతో కలిసి
అందరిని కలిపి

మీటింగులు జరిపి
పరీక్షలు జరిగే ప్రదేశాలలో
పర్యవేక్షణలు చేసి

అనుకున్న పని సాధించారు
వారి కఠిన చర్యల వలన
ఎందరో విద్యార్థులు ఫేలయినారు
వారూ — వారి తలిదండ్రులు
ఒక నిమిషం బాధపడినా
ఇదంతా మన మంచికోరకేనని
తెలుసుకున్నారు

కష్టపడి చదువుకుంటే
బాగుపడతాం
మన పట్టాకూ మనకూ
విలువ వస్తుందీ అని
ఆత్మ విశ్వాసం కలిగిందిఅందరిలో

మన వైస్ ఛాన్సలరుగారినీమధ్య
కలిసినపుడు ఎంతో వుత్సాహంగా వున్నారు
నావిద్యార్థులు ఎంతోమంచివారని మెచ్చుకున్నారు
వారిలో విద్యాబుద్ధులు
నేర్చుకోవాలనే తాపత్రయంవున్నది
నేను పడిన శ్రమ ఫలించింది
నాకెంతో ఆనందంగా వుందీఅన్నారు.

విద్యార్థి సోదరులారా—
ఏది మంచో ఏది చెడో
ఏవి నీళ్లో ఏవి పాలో

నిర్ధారణ చేసుకోని వయసులో నున్నవాళ్లు
మీ వుత్సాహాన్ని
మీ వుడుకు రక్తాన్ని
మీ సంఖ్యా బలాన్ని
తెలిసిన వారు కొందరు ప్రభృతులు
స్వప్రయోజనాల కొరకు
వినియోగించుకోడానికి
అవకాశాలున్న యీ రోజులలో
మీరు తొందర పడకండి
మీ విద్య ముఖ్యం
మీ భవిష్యత్తు ముఖ్యం
మీ తల్లితండ్రుల కలలు
పండించే భారం మీమీదేవున్నది
బాబూ—
మీ సోదరుల కళ్లు దగ్ధం చేస్తుంటే
వారి కాళ్లు బ్రద్దలు కొడ్తూంటే
వారి తలలు పగులుతూంటే
ఆ అలజడులలో
పోలీసువాళ్ల తుపాకి గోలిలకు
మీ రెందరో అవిటి వాళ్లవుతూంటే
కొందరు ఆహుతి అయిపోతూంటే
కళ్లార చూశానుబాబూ
దీని వలన లాభం చాలా తక్కువ జరిగింది
నష్టమే ఎక్కువజరిగింది.

ఎందరి చదువులో పాడై పోయినవి
ఎందరికో ఉద్యోగాలు దొర్కలేదు
డాక్టర్లు కావలసినవాళ్ళు
I. A. S. I. P. S. ఆఫీసర్లు
కావలసిన వాళ్ళంతా
క్లర్కుల ఉద్యోగాలకొరకు
కానపడిన కడపలన్నీ త్రొక్కి
వేసారిపోయారు.

ఎందరో ప్రాణాలు పోగొట్టుకొని
వారి తల్లి దండ్రులకు చావురాకముందే
మృత్యుద్వారాని కిడ్చి
మిగతా జీవితమంతా ఏడ్చుకుంటూ
బ్రతుకమనేసి వెళ్ళిపోయారు—
ఈ పరిస్థితులలో మిమ్ముకానీ
మీ తల్లిదండ్రులను కానీ

ఎవరైనా ఆదుకున్నారా ?
విద్యార్థిబలం లేనిదే
విప్లవంవచ్చిందా ? అంటే
పరిస్థితుల నర్థంచేసుకొని 'మెలగండి'
తొందర పడకండి అంటాను.

సోదరులారా !
మీలో—
వివేకానందుడు
గౌతమబుద్ధుడు
శివాజీ - నేతాజీ - గాంధిజీలాంటి మహాత్ముల
రక్తం ప్రవహిస్తుంది.
మీరే భవిష్యత్తులో
దేశ ప్రజలకు
సారథ్యం వహించవలసినవాళ్లు
అందుకోరకే—
మీరు విద్యనభ్యసించండి
క్రమశిక్షణ నేర్చుకోండి
మీలోని మతాతత్వాలను వదులుకోండి
అల్లర్లు మానండి
మీ దేశాన్ని బాగుచేయడానికి,
కంకణధారులు కండి
జయం మనదే.

---

శ్రీ పింగళి జగన్మోహన్ రెడ్డిగారు ఉస్మానియా యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్‌గా నియామకమై యూనివర్సిటీలో చదువుకున్న విద్యార్థులకు పోయిన సంఘాలు ఎంతో కష్టపడి తిరిగి సాధించినందుకు హృదయపూర్వక కృతజ్ఞతలతో

# అనుకరణ

సినిమాలుచూసి కొందరు
విదేశీయులనుచూసి కొందరు
బాబీ చూసి మరికొందరు
దిలీప్ కుమార్ స్టైలు కొందరు
రాజేష్ఖన్నా స్టైలు కొందరు
శత్రుఘ్నసిన్హా స్టైలు కొందరు
అనుకరణలు చేస్తున్నారు
ఆనందిస్తున్నారు
ఏదో పొడిచేశామని
కాలర్లు ఎత్తుకుని తిరుగుతున్నారు

కొంత మంది
జుట్లు పెంచుకుంటున్నారు
మీసాలు ముడివేస్తున్నారు
గడ్డమేదో మీసమేదో
తెలియని విధంగా తయారవుతున్నారు
భంగులు త్రాగుతున్నారు
L. S. D. మాత్రలు మింగుతున్నారు
Topless - Bottem Less
పద్ధతులనుకరిస్తూ
రాత్రిం బవళ్లు
త్రాగి తందనాలాడుతున్నారు

ఒరే అబ్బాయిలూ
చూసిన ప్రతి దానిని
అనుకరించడమే కానీ
దానిలోని మంచీ చెడూ
లాభం - నష్టం

అందం చందం
అవసరంలేదా అంటే
మీకేమి తెలుసు
ముసలిముండాకొడుకులు
మీతరం పోయింది
మా తరం వచ్చిందంటారు
అయినా—
ఈ వేషాలేమిటీ ?
లుంగీలు - లాగాలు
పొట్టిగడ్డాలు
పొడుగు మీసాలు

యీ మేకపోతు ముఖాలు చూసి
ఇంట్లోవాళ్లు గోలపెడ్తున్నారు
ఇంటికొచ్చినవారు
తండ్రెవడో కొడుకెవడో
తెలుసుకోలేక సతమతమౌతున్నారు

అందమైన ముఖం
అధ్వాన్నమై పోయిందని
ఆడాళ్ళు అసహ్యించు కుంటున్నారు
చిన్న జంతువులన్నీ
ఏవో కొత్త జంతువులనుకొని
పారిపోతున్నాయి

బాబూ మీకు
వీటిమీద ఇంత మోజుంటే
యీ అర్ధం పర్ధంలేని
గడ్డాల మీసాలకంటే
ప్రాచీన పద్ధతిలో
జుట్లు పెంచుకోండి
కనీసం యీ గడ్డమీద
పుట్టినందుకు

మన సంస్కారాన్ని
మన సాంప్రదాయాన్ని
నిలబెట్టినవాళ్ళమన్నా అవుతాం

# నక్సలిజం

పెట్టుబడిదారీ వ్యవస్థలు
మన ప్రభుత్వాలకు మూలస్థంభాలు
వీరి పెత్తనాలు పోనిదే
ప్రజల బ్రతుకులు బాగుపడవు
తుపాకీగోలీ బలం లేనిదే
తిరుగుబాటు రాదు
సమాజంలోని అసమానత్వం పోదు
కార్మిక కర్షక ప్రభుత్వం రాదు

దేశంలోని అత్యధిక ప్రజానీకం
పొట్టకు లేక – బట్టకు లేక
కంటినిండా నిద్రలేక
కన్న బాధలు పడుతూంటే
పెట్టుబడిదారులు
అభివృద్ధి నిరోధకులు
నల్లధనం దాచినవారు
యీ పేద ప్రజలకు
ఆగర్భ శత్రువులనే అభిప్రాయంతో
వారిని హతమార్చి
వారి డబ్బును - వారి భూమిని
వారి ఇళ్ళను స్వాధీనం చేసుకొని
దిక్కులేనివారికి పంచిపెట్టి
వారి ఆకలి బాధలు తీర్చి

సమ సమాజం నెలకొల్పాలనేదే
మన నక్సలైటు సోదరుల
ఆశయమైతే

ఆలోచనలో తప్పేమిలేదుకాని
ఎంతోచక్కటి ఆశయానికి
ఇంతక్రూరమైనపద్ధతి నవలంబిస్తారా ?
యీ హింసాకాండ లేకుండ
సాధించలేరా అంటే ?

ధనికవర్గం పాలించే
యీ పాలనలో
రక్తపాతం లేకుండా
పెట్టుబడిదారుల మనసులుమార్చి
వారికి త్యాగశీలతనేర్పించి
బలహీనులకు సహాయంచేయాలనే
బలమైన ప్రేరణకలిగించి
అనుకున్నరీతిగా
సమానత్వం తేవాలంటే

ఎంతకాలం కావాలి
ఎన్నియుగాలు రావాలి
అప్పటివరకు ఎన్నికోట్లప్రజలు
ఇలా ఆహుతిఅయిపోవాలి
అనివార్యప్రశ్న

అలాగైతే
ఏభై కోట్లకుపైగా జనాభాకలగిన
యీ దేశంలో
ఎన్ని లక్షలమందిని చంపి పంచితే
ఎన్ని కోట్లప్రజలకు ఎన్నిరోజులు పెట్టగలరు ?
మిగతావారికెలా ?
అంతేకాదు

నీవు చంపిన ప్రతిసోదరుడి ఇంట్లో
నల్గురు అనాథులు తయారౌతున్నారే
మరిమీరు ఒకలక్షమందిని చంపి
మూడులక్షలమందిని బాగుచేయకముందే
నాల్గులక్షల అనాథలను
దేశంలో మీరే తయారుచేస్తున్నారు
అయినా—

ఒకతండ్రి రెండులక్షలు సంపాదించి
ఇద్దరుకొడుకులకు సమానంగా ఇస్తే
ఒకడు పదిలక్షలు చేస్తున్నాడు
రెండవవాడు ఇచ్చినదంతా స్వాహాచేసి

తిండితిప్పలులేని పరిస్థితి తెచ్చుకొని
విధిలేక - చావురాక
వాడూ - వాడిపిల్లలు
వారిపొట్ట నింపుకొనుటకు

ప్రక్కవానింట్లో కన్నంవేసి
దుష్టులుగామారి లేదా
నక్సలైట్లుగా మారి
మరో లక్షాధికారిని
హతమార్చడానికి సిద్ధపడే
సోదరులెందరో
వున్న మన దేశంలో
రక్తపాతంతో
మీరు చేయదలచుకున్న
సమ సమాజ నిర్మాణమెలావుంటుందో
మీరే వూహించండి

దోపిడీ దొంగ
దోచిన దానిని
పరులకు పంచినంత మాత్రాన
మంచివాడై పోతాడా ?
ఒక రాక్షసుడు
ఒక మానవుణ్ణి చంపి
తోటి సోదర రాక్షసుల
ఆకలిబాధ తీర్చడానికి ప్రయత్నిస్తే
వాడిని దేవతగా పూజిస్తామా ?

నల్గురు పిల్లలను కలిగిన నీ తల్లి
తిండిలేక ఆకలితో నకనకలాడుతున్న

మీ బాధ భరించలేక
నీ సోదరుణ్ణి కోసి మీకు భోజనం తయారుచేస్తే
నీవు తినగలవా చెప్పు ?
పోనీ నిన్నుకోసి మిగతా పిల్లల
ఆకలిబాధ తీర్చడానికి
నీ తల్లి ప్రయత్నిస్తే
మేమంతా ఆనందించి-హర్షించి
పత్రికలలో పతాక శీర్షికలువేసి
ప్రపంచానికంతటికి
చాటిచెప్పమంటావా నీతల్లి త్యాగశీలత ?

నక్సలైటు సోదరులారా !
పరీక్షలో ఫస్టు రాలేదని
ఆత్మహత్య చేసుకుంటున్న విద్యార్థులు
మానభంగం జరిగిందని
ఉరిపోసుకుంటున్న సోదరీమణులు
పుట్టిన యీ దేశంలో పుట్టారు
ఆత్మాభిమానం కలిగినమీరుకూడా
మీ ఆశయ సాధన కొరకు
సమ సమాజస్థాపన కొరకు
కంకణ ధారులైనచో
హత్యలు మానండి

ఆత్మస్థైర్యంగల కొందరు
అగ్నిలో దూకి చూడండి
మిమ్ములను మీరే
ఆహుతి చేసుకుంటామని ప్రతిజ్ఞ చేయండి
అవసరమైతే ఆపనికూడచేసి చూపండి
ఆత్మహత్య నేరమైనా
మంచి ఆశయం కొరకు
ప్రాణాలర్పించారని
ప్రజలు హర్షించవచ్చు
మూర్ఖులకు కనువిప్పు కలుగవచ్చు
పెట్టుబడిదారుల మనసులు మారి
ఎన్నో సత్ఫలితాలు కలుగవచ్చు
అంతేకాదు——
తుపాకీగుళ్ళకు బలియై
నామరూపాలేకుండా పోయేమీరు
బ్రహ్మాండమైన ఆశయాలకొరకు
ఆత్మాహుతి నేసుకొని
అమరజీవులై పోయారని
యావత్ ప్రపంచంలోని
ప్రజలంతా జోహార్లర్పించగలరు

చీమలను-దోమలను కూడా
చంపడం పాపమని

ప్రపంచానికంతటికీ
ఎలుగెత్తి చాటిన
ఎందరో మహాత్ములు జన్మించిన
భారతావనిలో పుట్టి
నీ తోటి సోదరులను
ముక్కముక్కలుగా నరికి
మీ ఆశయాలు సాధించామని
మీరుసంతృప్తి చెందినా
హృదయమున్నవాడెవడూ
మీరు మంచి చేశారని
హర్షించలేదు

ఎంతమాంసం తినేవాడికైనా
కసాయివాడు తలలు తప్పించేముందు
వాటి అరుపులు వింటూంటే
కడుపు తరుక్కుపోతూందే
వాటి రక్తం చూస్తూంటే
కళ్లు తిరిగి పోతుంటాయే
మరిమీరు—
మనసోదరులు చేపల్లాగా తల్లడిల్లిపోతుంటే
వారి భార్యాపిల్లలు
గోడుగోడున దుఃఖిస్తుంటే
వారి గొంతులెలా కోయగలుగుతున్నారు ?

మీ మనస్సు ద్రవించదా ?
మీ హృదయం క్షోభించదా ?
ఈపంక్తులు వ్రాస్తూంటేనే
నా కలంలోని నల్లసిరా
ఎర్రబడుతూందే
నా కలం క్రింద పడిపోయి
నాసోదరీమణుల కన్నీటి బిందువులు
కాగితంమీద టపటపా రాలుతున్నవే
ఆ కన్నీళ్లకు తోడుగా
నా కళ్లు చెమరుస్తున్నవే
నా మనస్సు మంచులా కరిగి
నా కంఠం గద్గదమైపోతూందే
మీ మనస్సు చలించదా ?

వద్దుబాబూ వద్దు
ఈ హత్యాకాండ వద్దు
ఈ రక్తపాతం వద్దు
మిమ్ములను బ్రతిమాలు కుంటాను
మీ గడ్డం పట్టుకొంటాను
మీకు చేతులెత్తి మ్రొక్కుతాను
ఆశ్చర్యపడు తున్నారా ?
ఎందుకింత ప్రాధేయపడుతున్నానని
స్వప్రయోజనాల కొరకు

కొందరి సోదరులను అర్థించిన చేతులే ఇవి
నా భవిష్యత్తు బాగుపడాలని
ఎన్నో దేవుళ్లకు మ్రొక్కిన చేతులే ఇవి
నా సోదరులు హింసా ప్రవృత్తిని మార్చుకొని
తోటిసోదరుల గొంతులుకోయడం మానటానికి
ఒక్కసారి కాదు వందసార్లు మ్రొక్కగలను
ఒక్కరికి కాదు దేశంలోని
నక్సలైట్లందరికి వరుసపెట్టి మ్రొక్కగలను
దానివలన నా చేతులు మైలపడవు
నా కర్మలకొక పవిత్రతకలుగుతుంది
కొందరి సోదరుల ప్రాణాలు
కాపాడిన వాడినవుతాను
కొందరి సోదరీమణుల పసుపు కుంకుమలు
నిలబెట్టిన వాడినవుతాను
ఆనాడు నాకో శుభ దినం
ఆనాడే నా జన్మతరిస్తుంది
అందుకే—
మనిషికోసం మనిషిగా మారండి
మనుషుల కోసం రాక్షసులు కాకండి
ఇదే నా వినతి
ఇదే మీ అందరికి నా ప్రణతి.

---

హింసావాదానికి గురియై ప్రాణాలు కోల్పోయిన వారి ఆత్మశాంతికి – అనాథలైనవారి కుటుంబాలకు సానుభూతితో.

# డైనమిజమ్

ముఖ్యమంత్రిగా గద్దె ఎక్కిననాడే
ఎప్పుడో ఒకప్పుడు దిగవలసిన గద్దెఇది
దిగడాని కెప్పుడైనా
సిద్ధమే అన్నాడు
శాసనసభ్యుల కాకాపట్టడం
చేతకాదన్నాడు
వారిని జేబులో వేసుకోవడం
నేర్చుకో లేదన్నాడు
రెండు పుద్యమాలలో నలిగిన
ఆంధ్ర-తెలంగాణాల మధ్య
ఐక్యతను పటిష్టంచేసి
అన్నదమ్ములుగా అన్యోన్యంగా
కలిసియుండినటుల
కృషిచేస్తానన్నాడు
చిన్న విషయంకానీ
పెద్ద విషయం కానీ
అంతకంటే జటిల సమస్యేకానీ
ఒక నిర్ణయం తీసుకుంటున్నాడు
తాడోపేడో తేల్చేస్తున్నాడు
కొందరు సోదరులు
వారు తొందర పడుతున్నారన్నారు
అయ్యా—
ఆలస్యమైతే అమృతం
విషమవుతుంది

అంతకంటే ఆలస్యమైతే
వీపు చెక్కలవుతుంది
రాష్ట్రం ముక్కలవుతుంది
దేశం ముక్కముక్కలవుతుంది

మనసోదరులు కొందరు
సమయానికి సరియైన
నిర్ణయాలు తీసుకోనందున
ప్రాజెక్టుల బడ్జెట్లు
పెరిగిపోయావి
ఇచ్చినడబ్బు సకాలంలో
సద్వినియోగం చేయనందున
వచ్చిన ఆ లక్ష్మి తిరిగి
క్రొత్త ఢిల్లీ చేరుకుంది
ప్రణాళికలు - పథకాలు
పద్ధతి ప్రకారం జరుగనందున
నేటికీ దేశంలో
నీటి సమస్య తీరలేదు
కూటిసమస్య తీరలేదు
సోదరులారా

అభివృద్ధిపొందిన దేశాల్లాగా
అన్ని రంగాలలో మన
పనులన్నీ ప్లానుప్రకారం జరగాలంటే
మనలో "డైనమిజం" రావాలి

ఇది అణుయుగం
మనలో స్పీడు కావాలి
జెట్ స్పీడు కాదు
రాకెటుస్పీడు కావాలి
అది మనకు తెలియకపోతే
ఆ ప్రతిభ కలవారిని
చూసైనా నేర్చుకోవాలి

ఇది ముఖస్తుతా కాదు
ఏ మీటింగు కెళ్ళినా
ఏ సభ జరిగినా
ఎవరు ఏది అడిగినా కాదనలేదు
మున్సిపాలిటీలకు లక్షలకులక్ష లిచ్చారు
హౌజింగు బోర్డువారికి
కోట్లకొలది రూపాయ లిస్తున్నారు
అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో
అర్బన్ డెవలపుమెంటు వారెంత ఖర్చుపెడ్తే
అంత ఇస్తామన్నారు
కానీ ఇచ్చిన దానిని సకాలంలో
ఖర్చుపెట్టకపోతే
కార్యక్రమాలెలా పూర్తి కాగలవన్నారు ?

అయినా—
అడిగిన ప్రతిదానికి కాదనే

స్వభావం అలవర్చుకొన్నారు కొందరు
ఆపదలలో నున్న వారు
సహాయం చేయమనో లేక
న్యాయం చేకూర్చమనో
అని అడిగినపుడు
కనీసం ప్రయత్నిస్తామనైనా
అనకపోతే
వాళ్ళేమి ప్రజా ప్రతినిధులు?
మనమేమి ప్రజలం?

ప్రపంచ తెలుగు మహాసభలు జరిపించి
యీ తెలుగు గడ్డ మనది
మనమంతా తెలుగు బిడ్డలం
ప్రపంచంలో ఎక్కడున్నా
మనమంతా ఒక్కటే
అనే సందేశాన్నిచ్చారు
తెలుగుజాతి ఔన్నత్యాన్ని
ద్విగుణీకృతం చేసి
తెలుగు బిడ్డగా
తన కర్తవ్యం నెరవేర్చారు

నదీనదాలు మనకు జననీ జనకులు
తల్లి పాలకొరకు
తన్నుకు చచ్చేదెందుకన్నారు
దారితెన్ను తెలియని

గోదావరి జలాల సమస్యకు
శాశ్వత పరిష్కారం సాధించారు.

తిరుపతిలో
మహిళా పాలిటెక్నిక్
ప్రారంభోత్సవ సందర్భంగా
ఆ విద్యా సంస్థకు ఎవరెంత
సహాయం చేయాలనే
ప్రసక్తి వచ్చినపుడు
దేవస్థానం డబ్బయినా దేవుడిదే
ప్రభుత్వం డబ్బయినా దేవుడిచ్చినదే
మంచి పనులు చేయండి
శుభకార్యాలు తలపెట్టండి
కావలసినంత డబ్బు
అందిస్తూనే వుంటాడు ఆ భగవంతుడు
అని ఎంతో చక్కగా సెలవిచ్చారు

"ఈనాడు" పత్రిక ఆవిష్కరణ సందర్భంగా

"ఈనాడు" పత్రిక ఆనాగ్యురేషన్‌లో
వచ్చిన వారితో ప్రత్యక్షంగా
రాని వారితో పరోక్షంగా
ఒక్కమాట చెప్పారు.
ప్రభుత్వం ప్రజాక్షేమం కోరుతుంది
పరిపాలనలో పొరపాట్లుంటే
నిర్మాణాత్మకమైన సలహాలివ్వండి
ఆత్మశుద్ధిగా ఆచరిస్తాం అన్నారు.

ఎందరో నాయకులను చూశాం
ఎన్నో ఉపన్యాసాలు విన్నాం కాని
సమయం వస్తే
సంతోషంగా గద్దెనెగురుతాం
తప్పులుంటే చెప్పండి
దిద్దుకుంటాం — అన్న
నాయకులెందర్ని చూశాం?

కొందరు మిత్రులు
ఏమయ్యా నీవుకూడా నాయకులను
పొగడటం మొదలెట్టావ్? అంటే
లేదండీ
వారిలో వున్న సద్గుణాలను
అందరికీ అర్థమయ్యేలా వ్రాశాను
మన ముఖ్యమంత్రినే కాదు
మంచి అనేది ఎవరిలో వున్నా
మనం అభినందించాల్సిందే
వారినిచూసి మనం నేర్చుకోవాల్సిందే

అయినా రాష్ట్రంలో —
ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు
జరుగాల్సివుంది
ఎంతో ప్రగతిని సాధించాల్సివుంది అని విమర్శిస్తే
కాదనను కాని

ఇవన్నీ ఒక్కరితో జరిగేవా?
ఒక్క నాటితో జరిగేవా?

ఒక కుటుంబాన్ని చక్కగా
పోషించలేని మనం
ఒక్క పిల్లవాణ్ణి క్రమశిక్షణలో
పెట్టలేక సతమతమయ్యే మనం
కొద్దిమంది సోదరుల మీద
కొన్నికోట్ల ప్రజల బాధ్యతలు పెట్టి
కొన్ని వందల సంవత్సరాలుగా
మనలో నాటుకు పోయిన
సోమరితనాన్ని
బాధ్యతా రాహిత్య మనస్తత్వాన్ని
సంకుచిత భావాలను పోగొట్టి
మన సమస్య లన్నిటికీ
పరిష్కారం సాధించండీ అంటే
అది అంత సులభమా?

దేశంలోని
ప్రజలు—ప్రజానాయకులు
వ్యాపారస్తులు - ఉద్యోగస్తులు
వారి వారి బాధ్యతలు చక్కగా నెరవేర్చి
విరివిగా కర్మాగారాలు నెలకొల్పి
ఉత్పత్తిని పెంచి

ఆహార ధాన్యాల కొరతను తీర్చి
మనమధ్యవున్న
తారతమ్యాలను తగ్గించుకొని
ఒక త్రాటిమీద వెళ్ళుతూ
ఒక మాటమీద నడుస్తూ
చిత్తశుద్ధిగా
ఆశయ సిద్ధికి పాటుపడితే
మనం సాధించలేని కార్య మేముంది?
మనమెక్కలేని అందల మేముంది?

---

మనరాష్ట్ర ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ జలగం వెంగళ రావుగారు రాష్ట్రానికి, రాష్ట్ర ప్రజల అభివృద్ధికి దీక్షతో చేస్తున్న కృషికి కృతజ్ఞతతో.

# క్యాపిటలిజం

పెట్టుబడులు పెట్టి
పెద్ద సంస్థలను సృష్టించి
పెద్ద వ్యాపారాలు చేసి
కర్మాగారాలు నెలకొల్పి
రాత్రింబవళ్లు కష్టపడి
ప్రజల కవసరమైన
పదార్థాల నుత్పత్తి చేసి
డబ్బు సంపాదించి
ఆదాయం పన్నులు కట్టి
ఆస్తి పన్నులు కట్టి
"పవర్"లో వున్న పార్టీలకు
చందాలిచ్చి
ప్రభుత్వాలు నిలబెట్టేది మేము
ప్రజల నుద్ధరించేది మేము

గుళ్ళు - గోపురాలు
విద్యా సంస్థలు - విహార స్థలాలు
అందమైన పార్కులు
అద్భుతమైన భవనాలు
ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన
పాలరాతి మేడలు
"ఫైవ్‌స్టార్" హోటళ్ళు
"ఏర్ కండిషన్" థియేటర్లు
ఒక చేమిటి ప్రపంచంలోని

అందమైన ప్రతి వస్తువు
ఆరాధించబడే ప్రతి గుడి
ఆ గుడిలోని లింగాలను
సృష్టించేది మేమే-

ఇలా అవస్థలుపడి
అప్పులు తెచ్చి
పెట్టుబళ్ళు పెట్టి
నిద్రాహారాలు మాని
వచ్చే ఒడుదుడుకులను తట్టుకొని
మానసికా వేదనలకు గురి అవుతూ
ఒక చేయితో గుండెను పట్టుకొని
ఇంకో చేయితో ప్రజల
గుండెల గుండీలను పట్టుకొని
జీవితావసరానికి కావలసినవన్ని సమకూర్చి
అందరూ ఆనందంగా బ్రతికే
మార్గాలు వేస్తున్నాం-

మేము మా మేధాశక్తి నుపయోగించి
సరియైన ప్లాను వేసి
సాహసించి ఇవన్ని చేయకపోతే
కేవలం ప్రజల కండబలంతో
వారి సంఖ్యా బలంతో
అభివృద్ధి పథకాలన్ని అమలు జరపగలమా ?

అలాగైతే-
వెనుక బడిన దేశాలన్నీ
అప్పుల కొరకు
ఆహార పదార్థాల కొరకు
ఆత్మరక్షణకు కావలసిన
ఆయుధాల సరఫరా కొరకు
పెట్టుబడిదారీ దేశాలవెంట
అభివృద్ధి పొందిన దేశాలవెంట
ఎందుకు ఎగబడు తున్నారు ?
ఆ సహాయం పొందిన తర్వాత
ఆ విచిత్ర మేమోకాని
అప్పు ఇచ్చిన వాణ్ణి
అన్నం పెట్టిన వాణ్ణి
పాపాత్ముడుగా చూస్తున్నారు
హతమార్చ డానికి సిద్ధమవు తున్నారు

క్యాపటలిస్టు సోదరులారా !
మీరు చెప్పేది చాలా వరకు నిజమే
గుండె బలంలేని కండబలం
పెట్టుబడిలేని వ్యాపారం
మేధాశక్తి లేని శ్రామిక శక్తి
అంతగా రాణించలేవు
ఇవన్నీ వున్ననాడే
అన్నీ కలిసొచ్చిన నాడే

అనుకోని అవాంతరాలు అడ్డురాని నాడే
ప్రకృతి - వికృతం చేయనినాడే
మన ఆశలు పండగలవు
మన దేశాభివృద్ధి కాగలదు
కానీ—
డబ్బు సంపాదించడానికి
అభివృద్ధి నిరోధకులుగా మారి
తోటి సోదరుల ఇండ్లు కూలదోయడం
వారి సంసారాలు నాశనం చేయడం
వారి గొంతులు కోయడం
ఎంత దారుణం ?

బియ్యంలో - నెయ్యిలో
నూనెలో - తేనెలో
ఉప్పులో — పప్పులో
పసుపులో - పాలడబ్బాలలో
ఒక టేమిటి ?
ప్రజలకు పనికి వచ్చే
ప్రతి పదార్థంలో కల్తీయేనా ?
చివరకు రోగులు సేవించే మందులలో
ప్రాణరక్షణ కుపయోగించే ఔషధాలలో
కల్తీ కలిపి

ప్రజల ప్రాణాలు తీసి
సంపాదించే డబ్బు ఒక డబ్బా?
వీరు చేసేది ఒక వ్యాపారమా ?
యీ కల్తీ బ్రతుకులు కూడా ఒక బ్రతుకులేనా ?

ఆఫీసర్లను పట్టుకొని
ఆశలు చూపించి
కానిపనులు చేయించుకొని
లేనిది వ్రాయించుకొని
కష్టం చేయకుండానే
కాగితాలమీద ఎన్నో సృష్టించి
రెండు చేతులతో ధనార్జనచేసి
బ్లాకు మార్కెటీర్లుగా మారి
''స్మగ్లర్లు''గా తయారై
ప్రజల డబ్బును స్వాహా చేస్తున్నారు

ఇంతటితో ఆగకుండా
సంపాదించిన పచ్చనోట్లన్నీ పారవేసి
ఓట్లు సంపాదించి
ప్రజా నాయకుడిగా మారి లేదా
ప్రజా ప్రతినిధులను జేబుల్లో వేసుకొని
ప్రభుత్వమే మా చెప్పుచేతల్లో వున్నదని
విర్రవీగే యీ పెట్టుబడి దారులను
ఏమి చేయాలి ?

పూజించాలా !
పూలహారాలు వేసి ఊరేగించాలా ?

సోదరులారా ఆలోచించండి !
అక్రమంగా ఆర్జించిన యీ డబ్బు
దానివలన కలిగిన అహంభావం
కళ్ళు పూడుకు పోయి
వీరు చేసే దారుణాలే
ప్రపంచంలోని
యీ అలజడులకు మూలం
అల్లర్లకు ఆలవాలం
విప్లవాలకు కారణం
నక్సలైట్లకు నిలయం
మీరు పరోక్షంగా తీసే ప్రాణాలే
ప్రత్యక్షంగా నేడు జరిగేహత్యలకు కారణం
దీనికంతటికి బాధ్యులు మీరే

బ్రదర్స్—
ఇన్ని మోసాలు చేసి
ఇన్ని అక్రమాలుచేసి
లక్షలు కోట్లుగడించి పిల్లలకిస్తే
వృద్ధాప్యంలో సేవచేస్తారని
నిన్ను పూలల్లోపెట్టి పూజిస్తారని
చస్తే గంధంచెక్కలతో కాలుస్తారని

భ్రమిస్తున్నావా ?
ఆ ఆస్తులు - ఆ ధనంచూసి
క్రిందమీద కానకుండా
ఇక క్కడ తగిలేసిందిచాలక
పై చదువులని
పరదేశయాత్రలని
ఏ అమెరికాకో వెళ్ళి
నీవుచచ్చావని టెలిగ్రామిచ్చిననాడు
సెలవుల్లో విహారాలకెళ్ళిన నీ సుపుత్రుడు
"ప్యారిస్ "లోనో-రోం"లోనో
నీవుపంపిన నోట్లకట్టల మైకంలో
బరితెగించి-బట్టలువిప్పేసి
మధువు- మగువలమధ్య
నలిగిపోతూంటే
పంపిన టెలిగ్రాం
నీకర్మ జరిగిపోయినతర్వాత
ఆ అడ్రసులో ప్రస్తుతంలేడని
తిరిగివచ్చే ప్రమాదంలేకపోలేదు
అందుకే—
వద్దుబాబూ వద్దు
యీ పాపిష్టి సొమ్ముకొరకు
మానవజన్మ ఇంత
పాపభూయిష్టం చేయవద్దు
మనకు కావలసిన పట్టెడన్నంకొరకు

జానెడు బట్టకొరకు
ఆరడుగుల స్థలంకొరకు
ఎన్నో కానిపనులుచేసి
ఎన్నో పేకమేడలుకట్టుకొని
ఆనందించడానికి ప్రయత్నించవద్దు
అది ఆనందంకాదు
ఆనందిస్తున్నాననే భ్రమ—
నీలోపల దావాలనం దాగేవుంటుంది
నీఆత్మ క్షోభిస్తూనేవుంటుంది
మానసికానందంలేక
మాడిపోతూనేవుంటావు
నీఅంతరాత్మకు నీవెన్నిసమాధానాలు చెప్పుకున్నా
నీకుసంతృప్తి గలుగదు
నిద్రరాదు
నీగుండె గంటలు మ్రోగిమ్రోగి
ఏదోఒకక్షణం ఆగిపోతానని
భయపెడ్తూనే వుంటుంది
నీవువేసిన ఎత్తులు
నీవిచ్చిన లంచాలు
అన్నిసార్లు పనిచేయగలవా ?
ప్రభుత్వ ప్రతినిధులందరూ
ప్రజాప్రతినిధులందరూ
అభిమానంలేనివారనుకోకు
ఒకనాడు నీవుచేసిన పాపాలన్నిపండి

పరిహారం చెల్లించుకోవాల్సివస్తుంది
అనాడు నీవు నీపిల్లలు జైలుపాలై పోగలరు
లేదానీవుచేసిన దారుణాలకు
నీవే మానసికంగా దహించి
ఆహుతై పోగలవు—

సోదరా !
యీ పాడుబుద్ధులు మానుకో
యీ చెత్తవ్యాపారం వదలుకో
సక్రమమైన మార్గంలో సంపాదించు
అభివృద్ధిపథకాలు అమలుపర్చడానికి
చేయూతనివ్వు
సంపాదించిన దానిలోకొంత
ధర్మకార్యాలకుపయోగించు
అనాథులకు ఆశ్రయంకలిగించు

యీ డబ్బు యీ ఆస్తులు మనవికావు
కొంతకాలంపాటు మనందాని ట్రస్టీలమే
ఆడబ్బును సద్వినియోగంచేయి

ఇవన్నీ చేస్తున్నందుకు
నేనేదో పొడిచేస్తున్నానని
అహంభావం పెంచుకోకు



నీవుచేసేది సహాయంకాదు
అది నీ కర్తవ్యం-నీధర్మం
నీవు సమాజానికి సంఘానికి ఋణపడివున్నావు
ఆ ఋణం తీరుస్తున్నాననుకో

అందుకే—
మనిషికోరకు మనిషిగామారండి
స్వార్థంకోరకు రాక్షసులుకాకండి
ఇదే నా వినతి
ఇదే మీ అందరికి నా ప్రణతి.

---

మేకవన్నెపులులైన కొందరు పెట్టుబడిదారుల అక్రమ వ్యాపారానికి, ప్రత్యక్షంగా పరోక్షంగా బలియైపోయిన వారికి—

అనాథలైపోయిన వారికుటుంబాలకు సానుభూతితో—